సెప్టెంబరు 1998
సంపుటి 14 సంచిక 9

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of ***"SREEVANI"*** Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

Printed at
***SREEVANI OFFSET PRINTERS***
Machilipatnam

*Despatched on*
**7 - 9 -1998**

# శ్రీవాణి
## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



ముఖచిత్రం :
**నవదుర్గలు**

# అమృతవాణి

శ్లో ॥ ప్రదృశ్యతే వస్తుని యత్ర దోషో
న తత్ర పుంసోऽస్తి పునః ప్రవృత్తిః
అంతర్మహారోగవతీం విజానన్
కోనామ వేశ్యామపి రూపిణీం వ్రజేత్ ॥

సామాన్యంగా ఒక వస్తువులో వున్న దోషం పూర్తిగా అర్థమైనప్పుడు మనిషి మనసు ఆ వస్తువు మీద తిరిగి ప్రవర్తించదు. శరీరమంతా రోగాల పుట్టగా తెలిసిన తరువాత అందంగా ఉన్నప్పటికి వేశ్య పొందు ఎవరు కోరతారు?

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తే షూప జాయతే" అని చెప్పినట్లు విషయములను, తద్గత సుఖాలను కాస్త మనసులో తలచుకొంటే చాలు తిరిగి వాటిని అనుభవించాలనే ఆసక్తి కలుగుతుంది. స్మరించినంత మాత్రానే విషయాలు మనిషి ఇంద్రియాలను రథాన్ని గుర్రాలు లాగినట్లు లాక్కుపోతాయి. విషయాల వల్ల ప్రమాదమిదే. వీటి వల్ల కలిగేది క్షణికసుఖమే. మనస్సు ఈ ఇంద్రియాల ద్వారా విషయాలమీదకు పోయి ఆ సుఖం మరిగి అక్కడే లగ్నమయిపోతుంది.

ముందు, మనస్సే బంధ మోక్షాలకు కారణం. కనుక మొట్ట మొదట మనస్సును శుద్ధం చేసుకోటం ఆధ్యాత్మిక ప్రగతికి మూలమౌతుంది. అది బాగుపడితే మార్గం సుగమమవుతుంది. చేసే సాధన ఫలితాన్నిస్తుంది.

కనుక విషయములందున్న అల్ప సుఖాన్ని చూచి మనస్సు వాటి యందు ప్రవర్తించకూడదు. ఆ విషయాలిచ్చే తుచ్ఛ సుఖం కంటే మనిషికి ఎక్కువ ప్రమాదం తెచ్చి పెట్టే అనేక దోషాలు ఆ విషయాల్లో ఉన్నాయని తెలుసుకోవాలి. పాము తలపైన మణి వుంది కదా అని పాము కాటును భరిస్తారా ఎవరైనా? మణి కోసం పోతే మరణమే ప్రాప్తిస్తుందని తెలుసుకుంటే దాని వద్దకు ఎవరూ వెళ్ళరు.

అలాంటి దోషాలను చూచే దృష్టి మనసుకు అలవాటు చేయాలి. నిప్పును ముట్టుకొంటే ఒకసారి కాలిందనుకోండి తిరిగి మనిషి బుద్ధిపూర్వకంగా నిప్పులో వేలుపెట్టడు. అందుకోసం మనసుకు మంచి చెడుల వివేకం కలిగేలాగా సత్సాంగత్యాన్ని అలవాటు చేయాలి.

అసలు సృష్టిలో విషయాలకు ఆకర్షణ శక్తి ఎక్కువ. ఎలాంటి వ్యక్తినైనా ఇలా పట్టి వేస్తాయి. విషయాలన్నీ మేడిపండులాంటివి. పరిశీలిస్తేగాని వాని బండారం బయటపడదు. అలాంటి లోతుగా చూచే పరిశీలన మనసుకు కలిగితే మంచి ప్రయోజనం.

**కూచిభట్ల చంద్రశేఖర శర్మ**

పణ్యస్త్రీ ఇతరులనాకర్షించటానికి అనేక హొయలు చూపిస్తుంది. తన అం[illegible]ందాలను ఆకర్షించే విధంలో ప్రదర్శిస్తుంది. నిజం[illegible] ఆమె మనోహారిణి అయిన రూపవతి కావచ్చు. ఎవడైనా తెలివి తక్కువగా పై ఆకర్షణలకు లొంగి పొందుకోరితే వాడు తర్వాత అనుభవించేది నరకమే.

ఈ సంగతి బాగా తెలిసిన బుద్ధిమంతుని మనసు అటు ఆకర్షింపబడదు. కారణం అది రోగాల పుట్ట అని వానికి బాగా తెలుసు, కనుక ఆ దోషాన్ని చూడగలిగిన దృష్టి అతనికి వుండటం వల్ల వాని మనస్సు దాన్ని హేయంగా భావించి అది తుచ్ఛ సుఖమని తెలుసుకొన్నది కనుక.

ఈ విధంగా ప్రతి విషయంలోను మనస్సు దోషాల్ని చూడగలిగితే మనస్సు నిస్సంగమవుతుంది. విరక్తి కలుగుతుంది. ⊙

చందాలను రెన్యువల్ చేయండి !
క్రొత్త చందాదారులను చేర్పించండి !!

# TIRUMALA TIRUPATI DEVASTHANAMS, TIRUPATI



# BIRRD

## A SAGA OF SERVICE



Balaji Institute of Surgery Research and Rehabilitation for the Disabled (BIRRD), established by Tirumala Tirupati Devasthanams to alleviate the sufferings of the physically disabled stands out as an eloquent testimony of TTD's service to mankind.

Set up in 1985, the BIRRD blazed a new trail in the field of orthopaedics in many ways. Patients suffering from congenital anomalies, cerebral palsy and victims of polio are offered the best treatment in the hospital which is fully committed to serving the poor and needy in the society.

***THE BIRRD : SALIENT FEATURES :***

- State of-the art-technology is being used in the treatment of spinal injuries
- Over two lakh patients were successfully treated.
- Centrally air-conditioned hospital with a bed strength of 300 and four operation theatres.
- Free supply of artificial limbs, aids and supports.
- Income Tax Exemption under section 80(G) of Income Tax act.

Donations given by the philanthropists and the general public to the BIRRD are being made use of on various ongoing projects and utilised for free supply artificial limbs, free food and for arrangement of travel facilities to the partients at concessional rates. Donations may be sent by demand draft in favour of the Executive Officer, BIRRD (Trust), T.T. Devasthanams, Tirupati.



**M.K.R. VINAYAK,** I.A.S.,
EXECUTIVE OFFICER,
TIRUMALA TIRUPATI DEVASTHANAMS,
TIRUPATI - 517 501



Roc. No. PR4/30183/Adv.64, Dt. 22-8-98

# శరన్నవరాత్రులు

శ్లో॥ *అయిగిరినందిని నందితమోదిని విశ్వ వినోదిని నందినుతే*
*గిరివరవింధ్య శిరోధినివాసిని విష్ణువిలాసిని జిష్ణునుతే*
*భగవతి హేశితి కంఠ కుటుంబిని భూరికుటుంబిని భూరికృతే*
*జయజయహే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే॥*

పూర్వము మహిషాసురుడు పెట్టే బాధలు భరించలేక దేవతలు, ఋషులు వింధ్య వాసిని అయిన ఆ అమ్మను అనేక విధముల స్తుతించారు. వారి స్తోత్రములకు సంతోషించి జగన్మాత అయిన అమ్మ దేవతల, ఋషుల ఆర్తిని బాపటానికై దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయుటకై సింహవాహనాన్ని అధిరోహించి పదునెనిమిది చేతులతో పదునెనిమిది ఆయుధాలు ధరించి వారిముందు ప్రత్యక్షమయినది. ఆమె రూపం సుందరం. సుమనోహరం. ముల్లోకాలను మోహింపజేసే రూపం అది. మహిషాసురుడు ఆమెలోని మహాశక్తి రూపాన్ని గ్రహించలేక కేవలం పైకి కనపడే రూపాన్ని చూసి మోహించి మోసపోయినాడు. తత్ఫలితంగా తన వినాశనాన్ని తానే కోరుకున్నాడు. లోక కంటకుడైన ఆ మహిషాసురుని సంహరించిన రోజే ఈ విజయదశమి. సకల లోకములవారూ సంతోషాన్ని పొందిన రోజు ఇది. ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలు దశమి వరకు గల పది రోజులూ ఆ ఆదిపరాశక్తిని అనేక విధములుగా ఆరాధించి తరించుతారు. మొదటి తొమ్మిది రోజులూ ఆమెను నవదుర్గలుగా ధ్యానించి పూజించుతారు.

**"నవదుర్గాం మహాకాళీం, బ్రహ్మ విష్ణు శివాత్మికామ్**
**త్రికాల జ్ఞాన సంపన్నాం, నమామి భువనేశ్వరీమ్॥**

**దుర్గాదేవి ప్రథమ స్వరూపంతో శైలపుత్రిగా ప్రఖ్యాతిగాంచినది. హిమవంతుని పుత్రికగా ఈమె జనన మొందటం వలన కూడా ఈమె శైలపుత్రి అయినది. వృషభారూఢురాలైన ఈమె దక్షిణ హస్తంలో త్రిశూలమూ, వామహస్తంలో పద్మమూ శోభిల్లుతున్నాయి. నవదుర్గలలో ప్రథమదుర్గ ఈ అమ్మే.**

రెండవరోజు "బ్రహ్మచారిణి" గా అమ్మను పూజిస్తారు. బ్రహ్మచారిణి అంటే తపస్విని. బ్రహ్మచారిణి స్వరూపం పూర్ణజ్యోతిర్మయమై అత్యంత భవ్యమైనది. ఈమె దక్షిణ హస్తంలో జపమాల, వామ హస్తంలో కమండలం ఉంటుంది. దుర్గామాత యొక్క ఈ ద్వితీయ స్వరూపం భక్తులకు, సాధకులకు అనంతమైన ఫలాలను ఇస్తుంది.

**కొమరగిరి జయప్రద**

మూడవ రోజు దుర్గాదేవిని 'చంద్రఘంటాదేవి' గా ఆరాధిస్తారు. ఈమె స్వరూపం పరమశాంతి దాయకమైనది. కల్యాణప్రదమైనది. ఈమె తలపైన ఘంటాకారంలో అర్ధచంద్రుడు ఉన్నాడు. ఈమె శరీరం బంగారు కాంతులీనుతూ ఉంటుంది. ఆమెకు గల దశహస్తాలలో ఖడ్గాది అస్త్రాలూ, బాణాదిశస్త్రాలూ ఉంటాయి. సింహవాహిని అయిన ఆమె సర్వదా యుద్ధోన్ముఖమై ఉంటుంది. గనుక భక్తుల కష్టాలను అత్యంత శీఘ్రంగా నివారిస్తుంది.

నాలుగవ రోజు దుర్గాదేవిని "కూష్మాండాదేవి" గా పూజిస్తారు. తన యొక్క మందస్మితం చేత బ్రహ్మాండాన్ని ఉత్పన్నం చేయటం వలన ఈమె 'కూష్మాండాదేవి'గా పిలువబడుతున్నది. సూర్యమండల అంతర్భాగంలో ఈమె నివసిస్తూ ఉంటుంది. ఈమెకు ఎనిమిది చేతులు. సింహవాహనంతో, అష్టభుజాదేవి అన్న పేరుతో ఈమె ప్రసిద్ధిచెందింది. ఈమెను పూజించటం వలన ఆయురారోగ్యయశోబలాలు వృద్ధిచెందుతాయి.

**ఐదవరోజు అమ్మ "స్కందమాత"గా పూజలందుకొంటుంది. కుమారకార్తికేయుడు ఈమె పుత్రుడు. ఇతడే దేవసేనాధిపతి అయిన స్కంద కుమారుడు షణ్ముఖుడు. చతుర్భుజములలో.**

# పుట్టపర్తి

"ఈ పురవరమున నీవుండియే గదా
యింత సౌభాగ్యంబు హెచ్చు టెల్ల
యీ పట్టణంబున నీవుండియే గదా
కాశీ గయా భూతి గలుగు టెల్ల
యీ పట్టణంబున నీవుండియే గదా
వేద వేద్యులు కూర్మి వెలయు టెల్ల
యీ నగరంబున నీవుండియే గదా
పైరు పచ్చల తాళి పండు టెల్ల
యీ నిగమంబున నీవుండియే గదా
వైద్యశాలలు బిట్టువరలు టెల్ల
యెన్ని జన్మాల సుకృతంబు వెన్నుకొనుచు
వచ్చి పుట్టెరో యీ పురవాసులెల్ల,
కనక కలధౌతములచేత గ్రాలు టెల్ల
సామి నీనుండియే గదా సాయినాథ!"

- విద్యానందం.

సింహవాహన అయిన మాతఒడిలో, స్కందదేవుడు బాలుని రూపంలో ఈ తల్లి ఒడిలో ఆసీనుడై ఉంటాడు. స్కంద మాత ఉపాసన వలన సాధకునికి శాంతి సుఖాలు కలుగుతాయి.

ఆరవరోజు తల్లిని "కాత్యాయనీదేవి" రూపంలో ఆరాధిస్తారు. కాత్యాయనీ దేవి అమోఘ ఫలదాయిని. శ్రీకృష్ణుని భర్తగా పొందటానికి వ్రజగోపికలు యమునా తీరంలో ఈ దేవిని ఆరాధించారు. ఈమె చతుర్భు జాంకిత, సింహవాహన. మానవులకు మాతృదేవత కన్నా మిన్నఅయినది ఏదీ లేదు. ఈ తల్లిని సేవించినవారు పొందలేనిది ఏదీ లేదు.

ఏడవ రోజు "కాళరాత్రీదేవి" గా దుర్గామాతను పూజిస్తారు. ఈమె శరీరవర్ణం గాఢాంధకారం పోలినదిగా ఉంటుంది. ఈమె వాహనము గార్దభము. కాళరాత్రీ దేవి రూపము చూడటానికి అత్యంత భయంకరంగా ఉన్నప్పటికి ఆ తల్లి సర్వదా శుభాలనే కలుగజేస్తుంది. అందువలన ఈమెకు "శుభంకరీ" అనే పేరు కూడా ఉన్నది. ఈ జనని స్మరణ మాత్రం చేతనే అగ్ని, శత్రు, జంతు భయంకానీ, భూత, ప్రేతాదుల బాధకానీ ఉండదు.

దుర్గామాత యొక్క అష్టమస్వరూపం "మహాగౌరి". ఈమె గౌరవర్ణంలో ఉంటుంది. ఈమె వయసు అష్టవర్షాలు. (ఎనిమిది సంవత్సరాలు) ఈమె ఆభరణాలన్నీ శ్వేతవర్ణంలో ఉంటాయి. చతుర్భుజాలు కల ఈ తల్లి వృషభవాహన. ఈమె అత్యంత శాంతస్వరూపిణి. ఈమె శక్తి అమోఘమయినది. ఈమె ఆరాధన వల్ల జన్మ జన్మాంతర పాపాలు నశిస్తాయి.

దుర్గామాతయొక్క నవమశక్తి "సిద్ధిదాత్రి". సిద్ధిదాత్రీదేవి భక్తులకు, సాధకులకు సర్వసిద్ధులను ప్రసాదిస్తుంది. ఆమె సర్వసమర్థురాలు. ఈమె చతుర్భుజాంకిత, సింహవాహన. కాని ఒక్కొక్కప్పుడు పద్మాసనాసీన కూడా అవుతుంది. సాధకునికి సర్వసిద్ధులనూ, సర్వవిజయాలనూ సిద్ధింపజేసే తల్లి సిద్ధిదాత్రీదేవి.

1. జయన్తీ మఙ్గలా కాళీ భద్రకాళీ కపాలినీ ।
దుర్గా క్షమా శివా ధాత్రీ స్వాహా స్వధానమో2స్తుతే ॥
2. ప్రథమం శైలపుత్రీతి ద్వితీయం బ్రహ్మచారిణీ।
తృతీయం చన్ద్ర ఘణ్టేతి కూష్మాణ్డేతి చతుర్థకమ్ ॥
3. పఞ్చమం స్కన్దమాతేతి షష్ఠం కాత్యాయనీతిచ ।
సప్తమం కాలరాత్రిశ్చ మహాగౌరీతి చాష్టకమ్ ॥
4. నవమం సిద్ధిదాప్రోక్తా నవదుర్గాః ప్రకీర్తితాః ।
ఉక్తాన్యేతాని నామాని బ్రహ్మణ్యైక మహాత్మనా ॥
5. మహాబలే మహోత్సాహే మహాభయవినాశినీ ।
త్రాహిమాందేవి దుష్ప్రేక్ష్యే శత్రూణాంభయవర్ధనీ ॥

ఇది నవదుర్గల స్తోత్రం. దీనిని భక్తితో పఠించినవారికి ఏ భయాలూ ఉండవు. సర్వదా విజయం సిద్ధిస్తుంది. ఇది సత్యం. ఏరూపమైనా, ఏనామమైనా భగవత్‌చ్ఛక్తి మాత్రం ఒక్కటే. ఆ శక్తియే మనను సర్వదా నడిపిస్తుందన్న సత్యాన్ని

మనం మరువకూడదు. పరమేశ్వరునికి, పరాశక్తికి బేధం లేదు. అందుకే ఆయన శివుడు. ఆమె శివాని. ఆయన భవుడు. ఆమె భవాని. ఆయన రుద్రుడైతే ఆమె రుద్రాణి. పరమాత్మ స్వరూపమే పరాశక్తి. ఆ అనాది శక్తియే మహామాయ, మహాలక్ష్మి, మహాసరస్వతి. సమస్తమునకు ఆధారమయిన శక్తి ఒక్కటే. అదే ఇచ్ఛాశక్తి, జ్ఞాపకశక్తి, క్రియాశక్తి. అందుకే ఆమెను త్రిగుణాత్మిక అన్నారు. ఆమె సర్వశక్తి స్వరూపిణి. సర్వజ్ఞ భవ బంధాలను విచ్ఛిత్తి గావింపగల నైపుణ్యం ఆమె కొక్కర్తికే ఉన్నది. త్రిగుణాత్మకమైన స్వీయశక్తిచే, లోకాలను సృజించి, పెంచి, లయింపజేసే విశ్వజనని ఆమె. శరన్నవరాత్రులలో ఆ దేవిని భక్తి పూర్వకంగా ఆరాధించాలి. ధనవంతులు పీనాసితనం చూపకుండా, లేనివారు డాంబికానికి పోకుండా ఎవరిశక్తి కొలది వారు ఆ చల్లని తల్లిని పూజించి సేవించాలి. తొమ్మిది రోజులూ నియమ నిష్టలతో చేయలేనివారు త్రిరాత్రి వ్రతం చేయవచ్చు. అదీ చేయలేనివారు ఒక్క అష్టమిరోజునైనా అమ్మను భక్తి శ్రద్ధలతో పూజిస్తే చాలు. ఆమె సంతుష్టి చెంది సకల శుభాలనూ చేకూరుస్తుంది.

"పుం రూపం వాస్మరేద్దేవీం, స్త్రీరూపంవా విచన్తయేత్ ।
అథవా నిష్కలం ధ్యాయేత్ సచ్చిదానంద లక్షణమ్ ॥"

కాబట్టి ఆ దేవిని స్త్రీరూపంలో కాని, పురుష రూపంలో కాని, నిష్కలమైన సచ్చిదానందరూపంలో కాని పూజించవచ్చు. ఏ విధంగా పూజించినా ఆమె సంతుష్టి చెందుతుంది. ఈ చరాచర జగత్తులో "పునరపి జననం పునరపి మరణం" అని కాలచక్ర భ్రమణంలో పడిపోయే మానవుల సంచిత పాపములను సైతం సమూలాగ్రంగా విచ్ఛిన్నం చేసి కన్నతల్లి వలె మనలను కాపాడుతుంది ఆ జగన్మాత. కాబట్టి ఈ శరన్నవరాత్ర శుభసమయంలో మనమందరం ఆ తల్లిని పూజించి, సేవించి, తరించుదాం.

**ముఖ్యగమనిక**

వచ్చే సంచిక నుండి (అక్టోబర్'98) ద్వాదశ ..... ఒక్కొక్క క్షేత్రమును గురించి, ఒక్కొక్క సంచికలో పాఠకులకు అందించబడును. ఈ వ్యాసములను శ్రీ జోస్యుల రామచంద్రశర్మగారు అందించినారు. వారికి కృతజ్ఞతలు. - (సం)

**త్వరపడండి !** **త్వరపడండి !!**

**పోషకులుగా రూ. 1116/-**

శ్రీవాణికి పంపినవారికి ఈ క్రింది పుస్తకములు కూడా ఉచితంగా పంపబడును. దంపతుల ఫోటోలు శ్రీవాణిలో ముద్రించ బడును. ప్రతినెలా శ్రీవాణి క్రమం తప్పకుండా పంప బడును.

| | | |
|---|---|---|
| 1. | - | రు. 45-00 |
| 2. అమృతవాణి | - | రు. 10-00 |
| 3. శ్రీ సత్యసాయి శతకము | - | రు. 12-00 |
| 4. [illegible] | - | రు. 10-00 |
| 5. రామాయణ పాత్రలు | - | రు. 6-00 |
| 6. కనీస విజ్ఞానము | - | రు. 5-00 |
| | | రు. 88-00 |
| | | రు. 12-00 |
| మొత్తం : | - | రు. 100-00 |

**ముఖ్య గమనిక :**

- రు. 100/-లు M.O. ద్వారా విడిగా పంపినవారికి కూడా పై పుస్తకములు Reg. Post ద్వారా పంపబడును.
- రు. 1116/- లు పంపేవారు శ్రీవాణి పేర D.D. తీయించి పంపగలరు.

**చిరునామా:**

మేనేజర్ 'శ్రీవాణి' మాసపత్రిక
24-52, రామానాయుడుపేట
మచిలీపట్నం - 521 001.



# ఆత్మ సంబంధం కావాలి, దేహ సంబంధం కాదు

*"ప్రేమమయుండు శ్రీధరుడు ప్రేమయె ఆతని దివ్యరూపము*
*ప్రేమయె సర్వ రూపముల ప్రీతిగ తారక నామమంబట్టి*
*ప్రేమ మొకింతయైన వివరింపగ లేక జగంబునందు త*
*త్కామిత సత్ఫదార్థమెటు చేకూరునయ్య మానవా!"*

ప్రేమ స్వరూపులారా!

శాంతం, సఖ్యం, దాస్యం, అనురాగం, వాత్సల్యం, మధురం - ఇవన్నీ కూడనూ ప్రేమ యొక్క పర్యాయ పదములే. ప్రేమను మానవుడు ఎంత అభివృద్ధి గావించు కొనునో, అతనికి అంత ఆనందం లభిస్తుంది. మానవుడు ఆనందపిపాసి. నిరంతరం మానవుడు ఆనందమును ఆశిస్తుంటాడు. కారణమేమిటి? మానవుడు ఆనందము నందే పుట్టినాడు. ఆనందమునందే జీవిస్తున్నాడు. ఆనందమునందే అంత్యమవుతున్నాడు. ఈ ఆనందమే దైవ స్వరూపము. ఇట్టి దైవత్వాన్ని మానవుడు తనయందే ఉంచుకొని, బాహ్య ప్రపంచంలో వెదకటానికి ప్రయత్నిస్తున్నాడు. మానవుని వదలిన, ఈ ఆనందం ఎచట కూడనూ మనకు లభ్యం కాదు. చదువులో ఆనందం ఉన్నదని అనేక విధముల శ్రమపడుతున్నాడు. ఉద్యోగంలో ఆనందం వున్నదని అనేక ప్రయత్నములు చేస్తున్నాడు. పదవులలో ఆనందం వున్నదని పదవులకోసం ప్రాకులాడు తున్నాడు. గృహస్థ ధర్మమునందు ఆనందమున్నదని, తాను గృహస్థుడవుతున్నాడు. కాని ఈ విధంగా ఎన్ని ప్రయత్నములు చేసినప్పటికినీ, ఆనందమునకు మాత్రం అత్యంత దూరమవుతున్నాడు.

భగవంతునికున్న సమస్త నామములయందునూ "సత్,చిత్,ఆనందం" అనేటటువంటిది అత్యుత్తమమైనటు వంటి నామం. ఇట్టి ఆనందమును మానవుడు పొందవలెనన్న ఈ సత్, చిత్, ఆనందమునే అనుసరించాలి. 'సత్' అనగా త్రికాలముల యందు, త్రిలోకములయందు మారనటువంటి సత్యము. అట్టి సత్ ను మనం పొందవలెనన్న, సత్యమార్గమునందే దీనిని అనుభవించాలి. 'చిత్' అనగా పరిపూర్ణ జ్ఞానము. ఇట్టి పరిపూర్ణ జ్ఞానము చేతనే పరమాత్మను మనం పొందాలి. ఈ సత్, చిత్, ఆనందములు ఎక్కడ వుండునో, అక్కడే మానవునికి బ్రహ్మానందం ప్రాప్తిస్తుంది.

మానవుడు దైవమును పొందే నిమిత్తమై అనేక విధములైన సాధనలు చేస్తున్నాడు. నవ విధములైన మార్గములను అనుసరిస్తున్నాడు. ఇవి కేవలం తాత్కాలిక తృప్తి నిమిత్తమే కాని, శాశ్వతమైన ఆనందాన్ని అందించేవి

## భగవాన్ సాయి దివ్యబోధ

కావు. ఇవి ప్రాకృతమైనటువంటి సాధనలు. ఈ ప్రవృత్తి సాధనలు విరమించుకొనినప్పుడే, నివృత్తి అయినటువంటి నిత్యానందం మనకు ప్రాప్తిస్తుంది. అట్టి నిత్యానందమును, అట్టి బ్రహ్మానందమును అనుభవించగోరువారు 'సత్, చిత్' ను అనుసరించాలి. ఇట్టి ఆనందము మనకు లభించ వలెనన్న మనం సత్యమార్గములో ప్రవేశించాలి. సత్యమే ప్రత్యక్ష దైవము (Truth is God) ఈ సత్యం సర్వత్రా నిండినటువంటిది. ఇది ఒక దేశమునకు, ఒక కాలమునకు, ఒక ప్రమాణమునకు చెందినటువంటిది కాదు. సత్యము కాలాతీతమైనటువంటిది, దేశాతీతమైనటువంటిది, గుణాతీతమైనటువంటిది. అట్టి సత్యమును మనం అనుసరించినప్పుడే 'సత్' అనేటటువంటి ఆనంద స్వరూపుణ్ని మనం పొందగలం. దీనినే వేదము 'ఉద్ధరే ఆత్మనాత్మానామ్' నిన్ను నీవు ఉద్ధరించుకో! నీ సత్యమును నీవు గుర్తించుకో! నీ హృదయమును నీవు

పరిశీలించుకో! అందులో నీకు ఆనందం లభ్యమవుతుంది. కేవలం శరీరంతో చేసే కార్యములన్నీ తాత్కాలిక తృప్తిని మాత్రమే అందిస్తాయి.

ఈ దేహమునకు 'పిండము' అని ఒక పేరు. పిండము అనగా మానవునికి ఒక విధమైన అనుభూతిని అందించే మార్గం. Body is the Temple of God. కనుక ఈ దేవాలయమనే దేహమును భగవదర్పితం గావించటమే నిజమైన సాధన. ధర్మ, అర్థ, కామ, మోక్షములనే పురుషార్థములు నాలుగునూ ప్రవృత్తి మార్గమునందు మనకు శాంతి సంతోషముల నందిస్తుంటాయి. ఈ ప్రాకృతమైన జీవితమునకు శాంతి సుఖములనందిస్తున్నాయి. ఇది కాదు మనకు నిజమైన సుఖం. "పరమప్రేమ" అనే ఐదవ పురుషార్థమున్నది. భగవంతుని ప్రేమించేటటువంటి మార్గమునకు 'ప్రేమ శాస్త్రము' అని ఒకపేరు. ఈ ప్రేమ శాస్త్రమును ఎవరు చక్కగా అర్థం చేసుకుందురో, అట్టి వారికే ముక్తి లభిస్తుంది. 'ముక్తి' అనగా ఏమిటి? ప్రవృత్తి మార్గమునందు ముక్తాయం గావించుకొన్నదే ముక్తి. భగవంతునకు ఏది మనం అర్పితం చేయాలి? దేవుడు నివసించేటటువంటి ఈ దేహమును, ఈ దేవాలయమును భగవంతునికి అర్పించాలి. దీనినే 'పితృస్థానం' అన్నారు. అనగా పితృపిండము. ఈ పిండమే దేహము. దీనిని దైవమునకు అర్పించటమే ముక్తి. అనగా దేహముతో చేసే సర్వకర్మలూ దైవార్పితభావంతో చేయాలి. ఇదియే ఐదవ పురుషార్థమై నటువంటి 'ప్రేమ శాస్త్రము'. ఇట్టి శాస్త్రమును బోధించే నిమిత్తం, పవిత్రమైన ప్రేమను అందించే నిమిత్తం, సర్వత్రా చాటే నిమిత్తం నిరాకారి అయిన భగవంతుడే భూలోకము నకు దిగివస్తున్నాడు. అట్టి దిగివచ్చిన దినమునకు దైవము యొక్క పుట్టిన పండుగ అని చెప్పుకుంటున్నాం. భగవంతుడు ఎందుకు దిగివస్తున్నాడు? ఈ మాధుర్యాన్ని, మానవత్వానికి అందించి, తద్వారా మత్తును కలిపించి, ఉన్మత్తుని గావించి, మదోన్మత్తుని గావించడానికి వస్తున్నాడు. ఈ మాధుర్యాన్ని ఆస్వాదించిన వ్యక్తి ఉన్మత్తుడైపోతున్నాడు. తాదాత్మ్య భావన పొందుతున్నాడు. ఇట్టి మధురత్వాన్ని గ్రోలిన మానవుడు తాదాత్మ్య భావనలో మునిగి, ఆ మాధుర్యాన్ని అనుభవించి, ఆ మకరందాన్ని గ్రోలి, తాను మాధవత్వాన్ని పొందగలుగుతున్నాడు.

దేహం కేవలం పాంచభౌతికమైన తత్త్వమును పెంచుకొనేందుకు కాదు. "శరీరమాద్యం ఖలు ధర్మ సాధకమ్". మన కర్తవ్యాన్ని మనం నిర్వర్తించాలి. కర్మ ఫలాన్ని త్యజించాలి. ఓటమికి దూరం, త్యాగమునకు సమీపం కావాలి. అట్టి త్యాగస్వరూపుడే భగవంతుడు, అట్టి త్యాగమయుడే భగవంతుడు. అట్టి త్యాగానందమే భగవంతుని యొక్క ఆనందం. భగవంతుని ఆనందమును అనుభవించదలచినవారు, దేహాభి మానమును త్యజించి, ఆత్మాభిమానము అభిరించి ఈ యొక్క ఆనందమును అనుభవించడానికి ప్రయత్నించాలి. దేహమును కూడా సంరక్షించుకోవాలి. దేని నిమిత్తం? దైవార్పిత నిమిత్తమై ఈ దేహం మనకు అత్యవసరం. దేనిని దైవార్పితం చేయాలి, పరిపూర్ణమైన ప్రేమను మాత్రం దైవానికి అర్పించాలి.

దేహం ఏనాటికైనా అనిత్యమైనటువంటిదే. ఈ అనిత్యమైన దేహం నిమిత్తమై మనం కాలమును, కర్మలను, కాయమును అర్పితం గావించకూడదు. మనకు నిజమైన గుణం కావాలి. కలిమి, బలిమి, చెలిమి కాదు ప్రధానం. గుణం చాలా అవసరం. గుణంలేనివాడు ఎంత

కలిమిని సంపాదించినా వ్యర్థమే. గుణమును పోషించుకోవాలి. గుణం ప్రధానం, ధనం కాదు. గుణంలేని వానికి ఈ జగత్తులో చోటే లేదు. కనుక మనయందు సద్గుణములను పోషించుకోవటానికి తగిన కృషి చేయాలి. ఇట్టి పవిత్రమైన గుణ పోషణ నిమిత్తమై కృష్ణుడు అనేక రకములైన ప్రబోధలు సలుపుతూ తన సత్యమును నిరూపిస్తూ వచ్చాడు. వర్షములకు భరించుకోలేక గోకులవాసులందరూ బాధపడుతుంటే, గోవర్ధనగిరిని ఎత్తటానికి వెళ్లాడు. మానవునికి అన్నీ సందేహములే. "రండీ! ఈ పర్వతం క్రింద కూర్చోండి! అందరినీ సంరక్షిస్తాను" అని కృష్ణుడు చెబుతూ ఉండినప్పటికినీ ప్రజలందరూ "బాలుండీతడు కొండ దొడ్డది, మహాభారంబు ఈతండు మోయంగా జాలడా!" అని అనుమానిస్తున్నారు. దేహ ప్రమాణమును ఆధారం చేసుకొని, బలప్రమాణమును విచారించేటటు వంటి వారు మానవులు. దేహ ప్రమాణమును లెక్కచేయక, గుణప్రమాణమును లక్ష్యమునందు వుంచుకొనేటటు వంటిది దైవత్వం. భగవంతుని యొక్క ప్రేమకు, మానవునియొక్క ప్రేమకు వుండినటు వంటి వ్యత్యాసమును గుర్తించాలి. మానవుడు ప్రేమను అందుకొనుటకై అనేక విధములైన ప్రయత్నములు చేస్తుంటాడు. మానవుడు అందుకోవటానికి సిద్ధంగా ఉంటాడు. కాని భగవంతుని ప్రేమ అట్టిది కాదు. భగవంతుని ప్రేమ ఇచ్చేటటువంటిదే గాని, పుచ్చుకొనేటటువంటిది కాదు. పుచ్చుకునే హస్తము క్రింద ఉంటుంది. ఇచ్చే హస్తము పైన వుంటుంది. భగవంతుడు ఎల్లప్పుడు ఉన్నత స్థాయిలో వుండేటటు వంటివాడే గాని అథమ స్థాయిలో వుండేవాడు కాదు. ఏదిచేసినా, ఏది చూచినా, ఏది చెప్పినా, ఏది జరిగినా - అన్నింటియందునూ స్వార్థరహిత కర్మలనే ఆచరిస్తుంటాడు భగవంతుడు. భగవంతునిలో స్వార్థమే ఉండదు, స్వప్రయోజనమే లేదు. మానవుని యందు మాత్రం స్వార్థం, స్వప్రయోజనం కనిపిస్తుంది. స్వార్థం ఏనాడు త్యాగం చేస్తామో, ఆనాడే పరమార్థం ప్రత్యక్షమవుతుంది.

సత్యమును గుర్తించిన వ్యక్తి నిరంతరం ఆనందంతోనే జీవిస్తుంటాడు. ప్రేమనే సత్యము, ప్రేమనే జీవితం, ప్రేమనే గమ్యం. ప్రేమకు ప్రేమ తప్ప అన్య

# యక్ష ప్రశ్నలకు సమాధానములు

"తుల్యే ప్రియా ప్రియే యస్య
సుఖ దుఃఖే తథైవ చ
అతీతానాగతే చోభే
సవై సర్వధనీ వరః"

ఇష్టా నిష్టాలు, సుఖ దుఃఖాలు, భూత భవిష్యత్తులు అనే ఈ ద్వంద్వాలను ఎవడు సమబుద్ధితో చూడగలడో, అతడే అందరికన్నా ధనవంతుడైన మానవుడు.

పదార్థములు దీనికి సాటిరావు. కనుక ప్రేమకు సాటి ప్రేమనే. ప్రేమ చేతనే ప్రేమ స్వరూపుని పొందటానికి ప్రయత్నించాలి. కాని అది లౌకికమైన ప్రేమ కాదు, భౌతికమైన ప్రేమకాదు, ప్రాకృతమైన ప్రేమ కాదు. ఇది ప్రవృత్తి కాదు. ఇది నిత్య సత్యమైన నివృత్తి ప్రేమ. అదే దైవము యొక్క ప్రేమ. ద్వేషంతోనయినా, ప్రేమతోనయినా, కష్టముతో నయినా, బాదలచేతనయినా, దూషణలతోనయినా మరే విధంగా నయినా భగవంతుని ప్రేమను పొందవచ్చును. కృష్ణుని ద్వేషించి, దూషించిన శిశుపాలుని ప్రాణములు సహితం చిట్టచివరికి భగవంతునిలో చేరిపోయాయి. ప్రేమతో భగవంతుని దూషించినా దోషంలేదు. ఆ దూషణలు కూడా ఒక భూషణే. తిరస్కారము కూడనూ ఒక భూషణే. ఇలాంటి ప్రేమతత్త్వాన్ని ఆనాడు భగవంతుడు అందిస్తూ వచ్చాడు. కనుక ఈ ప్రేమ చేతనే మనం భగవంతుని పొందాలి. ఎన్ని సాధనలు సలిపినా ఇవి మనకు తాత్కాలిక తృప్తిని మాత్రమే అందిస్తున్నాయిగాని, శాశ్వతమైన ఆనందాన్ని మాత్రం అందించవు. కనుక ప్రేమతత్త్వము చేతనే ప్రేమ స్వరూపుణ్ణి పొందాలి. ఈ ప్రేమ ఎక్కడ ఉన్నది? మనయందే ఉంటున్నది. అయితే ఆ ప్రేమను అనేక మార్గములలో ప్రసరింపజేస్తున్నాం. మార్గములు వేరు గాని ప్రేమ ఒక్కటే. అనేక తీపి పదార్థములు చేస్తుంటాం. అన్నింటియందు వుండినటువంటి చక్కెర ఒక్కటే. అదే విధముగ ఆ దివ్యత్వమనే ప్రేమ సర్వులయందు ఉన్నది. ప్రేమలేనటువంటి హృదయం ఈ జగత్తులో కానరాదు.

సర్వులయందు ఉండినటువంటి ప్రేమతత్త్వాన్ని మనం ప్రత్యక్షం గావించుకోవాలి. ఈ మార్గమును బోధించే నిమిత్తమై కృష్ణుడు అవతరించాడు. మానవునియందున్న ప్రేమను అభివృద్ధి పరచటం, ఆ ప్రేమ మాధుర్యాన్ని వారికి చవిచూపించటం, ఆ ప్రేమ మాధుర్యం చేత వారిని ఉన్మత్తులను గావించి, జీవన్ముక్తికి మార్గం కల్పించటమే దైవము యొక్క పని. కనుక సత్, చిత్, ఆనందములోని 'సత్' మార్గంలో మనం ప్రయాణం చేయాలి. సత్యమార్గంలో మనం ప్రయాణం చేయాలి. పరిపూర్ణ జ్ఞానంలో మనం జీవించాలి. అప్పుడే పరిపూర్ణ స్వరూపుడైన పరమాత్మ మనకు ప్రత్యక్షమవుతాడు.

*"దేవుడనగ వేరు దేశమందున లేడు*
*దేవుడుండు తనదు దేహమందె"*

ఏ దేశమునందోలేడు. ప్రతి దేహమునందు దేవుడున్నాడు. తనయందే ఉన్నవాడి కోసం బయట ప్రపంచంలో వెదకటమెందుకు? భగవంతుడు ఆనంద మయుడు. అతనే "**నిత్యానందం, పరమసుఖదం, కేవలం జ్ఞానమూర్తిం, ద్వంద్వాతీతం, గగన సదృశం, తత్వమస్యాది లక్ష్యం, ఏకం, నిత్యం, విమలం, అచలం, సర్వధీసాక్షి భూతం, భావాతీతం, త్రిగుణ రహితం**". అట్టి ఆనందం ప్రతి మానవుని యందూ ఉంటున్నది. అయితే ఇది ఎప్పుడు మనకు ప్రత్యక్షమవుతుంది? ఒకే జ్యోతి ఉంటున్నది. ఆ జ్యోతిపైన ఒక కుండను బోర్లించాం. ఆ కుండకు పది చిల్లులు ఉంటున్నాయి. ఈ పది చిల్లుల కుండపై ఒకటర్కీ టవల్ కప్పివేశాం. టవల్ కప్పటం చేత జ్యోతి కనిపించటం లేదు. మన దేహమే ఒక దట్టమైన రగ్గు. లోపల మన ఆత్మ జ్యోతియే, అదియే భగవత్ జ్యోతి. ఈ దేహమునకు పది చిల్లులు ఉంటున్నాయి. దీనిపైన భ్రమ అనే బ్లాంకెట్ కప్పుకున్నాం. మొట్టమొదట 'తమోగుణం' అనే బ్లాంకెట్‌ను తీసివేయండి. అప్పుడు పది జ్యోతులుగా కనిపిస్తాయి. అప్పుడు దేహమనే కుండను కూడా బ్రద్దలు చేయాలి. అప్పుడు ఒకే జ్యోతి కనిపిస్తుంది. "ఏకం సత్ విప్రా బహుదా వదంతి". ఉన్నది ఒక్కటే. ఒక్కటే అయినప్పటికీ ఈ ఇంద్రియముల ద్వారా అనేక రూపములు గోచరిస్తుంది. కనుక ఏకజ్యోతి అయినటు వంటి ఈ దివ్యజ్యోతిని అన్నింటియందును ప్రత్యక్షం గావించుకోవాలి. అనేకత్వంలో వున్నటువంటి ఏకత్వాన్ని మనం దర్శించాలి. ఎన్ని రంగుల బల్బులుండినప్పటికినీ, ఎన్ని రకముల ఓల్టేజి బల్బులుండినప్పటికినీ, అందులోని కరెంటు మాత్రం ఒక్కటే. ఒక్కొక్క దేహం ఒక్కొక్క బల్బు వంటిదే. వారి వారి శక్తిని బట్టి వారి కెపాసిటీ ఉంటుంది. అన్నింటియందును దివ్యమైన ఆత్మతత్త్వం ఒక్కటిగానే ఉంటుంది. ఇలాంటి ఏకత్వాన్ని దర్శించడానికి తగినటువంటి కృషి చేయాలి. అలాంటిది చేయకుండా నవవిధ భక్తి మార్గములలో ఏదో ఒక మార్గాన్ని అనుసరిస్తున్నాం. దేహభ్రాంతి కలవారికే ఈ భ్రాంతులు. దేహభ్రాంతి లేనటువంటి వారికి ఈ సాధనలే అవసరం లేదు. నీవే దైవము, దైవమే నీవు అనేటువంటి సత్యమును గుర్తించినటువంటి వాడే అన్ని సాధనలు విరమిస్తాడు. నిజమైనటువంటి ఆత్మ తత్త్వం ఒక్కటే. అదే 'కాన్షస్'.

*You are not one person, But three*
*The one you think you are - Physical Body*
*The one others think you are - Mental Body*
*The one you really you are - Atma.*

దాని పైననే మనం రక్షణ తీసుకోవాలి. దానినే మనం సాధించాలి. ధన కనక వస్తు వాహనాదులన్నీ కదిలి పోయే మేఘముల వంటివే. ఏదీ శాశ్వతమైనటువంటివి కావు. మనం చేసే కర్మలే పవిత్రమైనటువంటివి.

కృష్ణుడు ఒకానొక సమయంలో ఒక ప్రశ్న

## విదురనీతి

"య ఈర్ష్యః పరవిత్తేషు
రూపే వీర్యే కులాన్వయే
సుఖ సౌభాగ్య సత్కారే
తస్య వ్యాధిరనన్తకః".

*ఎవడు ఇతరుల ధనము, రూపము పరాక్రమము, కులము, సద్వంశము, సుఖము, సౌభాగ్యము, సత్కార్యము చూసి ఈర్ష్యపడుచుండునో, వాడి జబ్బు ఎప్పటికీ కుదర్చరానిది.*

వేశాడు. ఎవరు విజయుడు? అని అడిగాడు. "యుద్ధంలో విజయమును సాధించినటువంటివాడు విజయుడు" అని చుట్టూ వున్న గోపాలబాలురు చెప్పారు. 'కష్టములు ధైర్యంగా ఎదుర్కొనేటటువంటివాడు విజయుడు' అని కొందరు చెప్పారు. 'దుఃఖములకు ఎదురు తిరిగి దానిని సాధించినటువంటివాడు విజయుడు' అని మరి కొందరు చెప్పారు. ఈ విధంగా ఒక్కొక్కరు ఒక్కొక్క విధమైన జవాబు చెబుతూ వచ్చారు. అప్పుడు కృష్ణుడు నవ్వుతూ "విజయము అంటే ఇది కాదు. ఇవి తాత్కాలికంగా సాధించే విజయాలే. ఇంద్రియ నిగ్రహమే నిజమైన విజయము" అన్నాడు. కనుక ఇంద్రియములను మనం నిగ్రహించుకోవాలి. ఇంద్రియములను జయించిన వాడే విజయుడు. కసరత్తుల ద్వారా గాని, సాధనలద్వారా గాని ఇంద్రియాలను సాధించలేం. శాశ్వతమైన విజయమును ప్రేమచేతనే సాధించగలం. సత్యము చేతనే సాధించాలి. సత్యం వద, ధర్మం చర అన్నారు. సత్యం ద్వారా మనం సర్వస్వాన్ని పొందగలుగుతాం.



'నాది', 'నేను' అనేటటువంటి అభిమానమే సర్వ దుఃఖములకు మూలకారణం. ఈ రెండింటిని మనం దూరం చేసుకోవటానికి మనం ప్రేమతత్త్వాన్ని పెంచుకోవాలి. ప్రేమచేత దేనినైనా సాధించవచ్చును. ప్రేమ చేత విశ్వాసం కూడా పెరుగుతుంది. భగవంతుడు ప్రేమ స్వరూపుడే. భగవంతుని ప్రేమలో స్వార్థం అనేదే వుండదు. కారణం ఏమిటి? 'నాది, నేను' అనేది అక్కడ లేదు. ఉన్నది ఒక్కటే. '1' (ఒకటి) పెట్టి ప్రక్కన సున్నాలు పెడుతూ పోతున్న కొద్దీ దాని విలువ పెరుగుతూ పోతుంది. మిలియన్స్ మిలియన్స్‌గా మారి పోతుంటుంది. ఆ 'ఒకటి' లేకపోతే ఆ సున్నాలకు విలువే ఉండదు. ఆ ఒక్కటే Hero. మిగతావన్నీ 'జీరో'లే. 'హీరో'ను ('ఒకటి'ని) గనుక మనం మరిచిపోతే అంతా 'జీరో'లే. కనుక 'హీరో' అయినటువంటి దైవత్వాన్ని మనం మరచకూడదు. Hero becomes Zero if he forgets God ఈ సృష్టికంతా అతనే ఆధారం. ప్రేమే మూలకారణం.

అనేకమంది అనేక పదార్థములు భగవంతునికి అర్పితం చేస్తుంటారు. కాని నిజమైన భక్తుడు మాత్రం తన దేహమునే అర్పితం చేసుకుంటాడు. బలి చక్రవర్తి తన దేహమునే అర్పితం గావించుకున్నాడు. అప్పుడు భగవంతుడు ప్రత్యక్షమైనాడు. అతనికి పునర్జన్మే లేకుండా పోయింది. ఈ దేహము భగవంతునికి అర్పించే పుష్పము వంటిదని భావించుకోవాలి. ఈ జీవితాన్ని సత్కర్మల చేతను, సదాచారములచేతను, సత్ప్రవర్తనల చేతను, సద్వినియోగ పరచి, కట్టకడపటికి భగవంతునికి అర్పితం చేయాలి.

'పిండార్పణ' అంటే పితృదేవతలకు అర్పించే పిండములని చాలామంది బ్రాహ్మణులు చెబుతుంటారు. అది కాదు. పిండమనగా దేహమే. ఈ పిండమనే దేహమును భగవదర్పితం చేయటమే పిండార్పణ. దీనిని భగవదర్పితం చేయటమే నిజమైన మోక్షం. అదియే ముక్తి. ఎప్పుడు అర్పితం చేస్తామో అప్పుడు మోహమే ఉండదు. ఎప్పుడు దేహక్షయమో అదే మోక్షం. మోహము లేదు. మోహము క్షయమైపోయింది. అదే మోక్షం. ఈ విధమైన సత్యాన్ని గుర్తించి వర్తించిన వ్యక్తులు ఎంతైనా ఆనందాన్ని అనుభవించవచ్చును. అట్టి పవిత్రమైన స్థితికి వచ్చేంత వరకును, సాధ్యమైనంతవరకు దేహాన్ని కాపాడుకోవాలి. ఈ జగత్తులో మనం కొన్ని కార్యాలు చేయాలి. కర్తవ్యాలు నిర్వర్తించాలి. ధర్మాన్ని ఆచరించాలి. సత్యాన్ని అభివృద్ధి పరచుకోవాలి, త్యాగాన్ని మనం పోషించుకోవాలి. ప్రాచీన కాలమందు మన భారతీయులు త్యాగానికి పట్టాభిషేకం చేశారు. కరుణని అందలం ఎక్కించారు. వైరాగ్యానికి కంకణం కట్టారు. సత్యానికి స్వాగతం పలికారు. ఇది

భారతీయులు చేసిన పని. అనాది కాలమునుండి భారతీయుల హృదయం కరుణతో నిండి ఉండినటు వంటిది. ఆనాటి మన ప్రాచీనులు అందరూ అనేక విధముల సాధనలు చేశారు. ఆనాడు వారు సాధించి, అందించిన సుధా నిధియే ఈనాటి ప్రేమభక్తి అనేటటు వంటి వెన్న. అలాంటి భారత దేశంలో మనం పుట్టి, భారతీయులమనిపించుకొని, భారతదేశం యొక్క గొప్ప తనాన్ని మనం గుర్తించుకోలేకపోతున్నాం. ఈ భారత దేశము యొక్క పవిత్రమైన చరిత్రను మనం గుర్తించుకోవాలంటే మనం చాలా పాటుపడాలి.

బలరాముడు ఒక పర్యాయం కొంతమంది గోపికలను, గోప బాలురలను తీసుకొనివచ్చి "అమ్మా! కృష్ణుడు ఇంత ఆకలిగొన్నాడా? ఇంట్లో తింటాడు, బయట తింటాడు, ఎప్పుడు చూచినా తిండి....తిండి.... కాని మట్టి ఎందుకు తినాలి? ఈ వేళ మట్టి తిన్నాడు" అన్నాడు. యశోదకు చాలా కోపం వచ్చింది. కృష్ణుని చెవి పట్టుకుంది. "కృష్ణా! మట్టి తినటానికి కారణమేమిటి? నన్ను అడిగితే నీకు ఏది కావాలంటే అది పెట్టనా? గోపికల ఇంట్లో నీవు కావల్సినంత వెన్న తినటం లేదా? ఇంట్లో భోజనం చేసి కూడా, ఈ మట్టి ఎందుకు తింటున్నావు?" అని అడిగింది. అప్పుడు కృష్ణుడు "తల్లీ! అమ్మా! మన్ను తినంగ

**సంభోగ సంవిద్విష మేధమానో**
**దత్తాసుతాపీ కృపణో బలీయాన్**
**వర్గప్రశంసీ వనితాంచ ద్వేష్టా**
**ఏతేపరే సప్త నృశంసరూపాః**

*సుఖ, భోగాపేక్షగలవాడు, ఇతరులకపకారం చేసి పైకివచ్చేవాడు, దానం చేసి వగచేవాడు, అల్ప లాభం కోసమై ఎటువంటి అవమానాన్ని అయినా సహించేవాడు, బుద్ధిబలంలేనివాడు, కుటిలాత్ముల్ని ప్రశంసించేవాడు, ఉత్తమురాలైన భార్యను ద్వేషించేవాడు - ఈ ఏడుగురు నృశంసులు. అంటే దుష్టవర్తనులని సారాంశం.*

నేశిశువునా? ఆకొంటెనా! వెర్రినా!" అని నేను పిచ్చివాడను కాదు, నేను చిన్నపిల్లవాడను కాదని, తాను గొప్పవాడనని, మాటల మధ్యలో వ్యక్తం చేస్తూ వచ్చాడు. 5 సంవత్సరాల చిన్నపిల్లవాడే. అయినప్పటికి తాను చిన్నపిల్లవాడను కాదనే సత్యాన్ని చక్కగా వివరించాడు. తాను పిచ్చివాడను కాదని, తాను గొప్పవాడనని చెప్పాడు. చిన్న వయసులోనే పవిత్ర భావాలను జగత్తుకంతా చాటుతూ వచ్చాడు కృష్ణుడు. సాధారణంగా కృష్ణుని యొక్క లీలలుకాని, చర్యలు కాని, దైవము యొక్క అంతరార్థముగాని ఎవరూ గుర్తించుకో లేరు. బాహ్యంగా ఒక అర్థం, అంతరార్థం మరొకటి. ఈ విధమైన అంతరార్థములను గుర్తించుకొనేటటువంటి వ్యక్తులు ఈనాడు కరువైపోయినారు. అందువలననే అనేక సందేహాలతో కుమిలిపోతున్నారు. ఎక్కడ చూచినా సందేహాలే. కంటితో చూచినవి కూడా నమ్మలేక పోతున్నారు. ఇక్కడ యశోద కూడా అనుమానించింది. కృష్ణుడు నోరు తెరచినప్పుడు చూచింది. "కలయో వైష్ణవ మాయయో, ఈశ్వర సంకల్పార్థమో, సత్యమో...." అని ఆ నోటిలో వున్న 14 లోకములను చూచి భ్రమించింది. తన కంటితో చూచినప్పటికి తాను నమ్మలేకపోయింది. దీనికి మూలకారణమేమిటి? వాత్సల్యమే!నా కుమారుడు... నా కుమారుడు... ఈ శారీరక సంబంధమే ఇన్ని సందేహాలకు మూలకారణం. కనుక ఆత్మ సంబంధం కావాలి. దేహ సంబంధం కాదు. ఆత్మ ఆత్మలో ఏకమైనప్పుడు సర్వమూ ఏకమైపోతుంది. అట్టి ఆత్మకు ఆత్మకు సంబంధమే ఆధ్యాత్మికము. దేహానికి, దేహానికి సంబంధం భౌతికం. కనుక ఇలాంటి అనేక సందేహములను రూపుమాపి, దివ్యత్వాన్ని ప్రసరింపజేసి, పవిత్రతను కాపాడినటువంటివాడు కృష్ణుడు. అన్ని అవతారములు దివ్యమైనవే అయినప్పటికినీ, కృష్ణుడు మాత్రం నిరంతరం నవ్వుతూ.. నవ్వుతూ... తన జీవితాన్ని ప్రదర్శిస్తూ వచ్చాడు. ప్రేమచేతనే అర్పితంగావించుతూ వచ్చాడు. ఎలాంటి పరిస్థితులలోను క్రోధమనేటటువంటిదే లేదు. నిరంతరం నవ్వూ... నవ్వూ.... నవ్వూ... ఇది దైవం యొక్క ప్రధానమైన లక్షణం. ఎప్పుడూ, ద్వేషంగాని, అసూయ గాని

అహంకారం గాని, ప్రదర్శించలేదు. అట్టి పవిత్రమైన గుణములు ఇప్పుడు మాత్రమే (ఈ అవతారంలో మాత్రమే అనగా భగవాన్ సాయిలో) కనిపిస్తున్నాయి. ఏ అవతారంలో కూడా కనిపించలేదు. కాని అన్ని అవతారములలో ఆయా దివ్యత్వం ఒకటే అయినప్పటికినీ, కొన్ని కొన్ని పరిస్థితుల ప్రభావములను పురస్కరించుకొని, ప్రవర్తిస్తూ వచ్చారు. కాన దైవత్వమును మనం హృదయ పూర్వకంగా విశ్వసించాలి. నిన్ను నీవు ఏ రీతిగా విశ్వసిస్తున్నావో? ఆ విధంగానే భగవంతుని విశ్వసించాలి. Faith in Yourself and God, This is the Secret of Greatness. నీవే దైవం, దైవమే నీవు అనే విశ్వాసం ఉండాలి. సందేహాలకు ఎందుకు అవకాశం ఇస్తున్నావు? సందేహాలు నీ దేహాన్నే ధ్వంసం చేస్తాయి. కనుక సందేహాలను దూరం చేసుకోండి! అనుమానాలను నిర్మూలనం గావించుకోండి! ప్రేమతత్త్వాన్ని పెంచుకోండి! సత్యమార్గంలో ప్రవేశించండి! దివ్యమైనటువంటి తత్త్వాన్ని అనుభవించండి! ఇదే నిజమైన సాధన, ఇదే నిజమైన ఆధ్యాత్మికము.

*(ది. 14-8-1998 ప్రశాంతి నిలయంలో, కృష్ణాష్టమి సందర్భమున భగవాన్ సాయి అనుగ్రహించిన దివ్య సందేశమునుండి)*





# గణపతి

'గణపతి' అనగా గణములకు అధిపతి అని అర్థం. దేవతలకు ప్రథమ ఆరాధకుడు. సమస్త జీవులకు, సర్వకార్యములకు విఘ్నేశ్వరుడు ప్రథమ పూజార్హుడు. వినాయకునికి ఏనుగు తల ఎందుకు పెట్టారని కొందరికి సందేహం కలుగవచ్చు. ఏనుగు తల అధికమైన తెలివితేటలకు చిహ్నం. మనుష్యులైనా కళ్ళు మూసుకొని ముందుకు అడుగు వేస్తారేమోగాని, ఏనుగు మాత్రం ముందు చూడక అడుగు వేయదు. ఘోరారణ్యములో ఏనుగు ఒక్కసారి ముందు నడుస్తే దారి ఏర్పడుతుంది. అగే విధంగా గణపతిని ముందుపెట్టుకొని పోతుంటే జీవితారణ్యంలో మన నడక సుఖంగా సాగుతుంది. గజమునకు తెలివి తేటలు అపరిమితం. కనుకనే 'గజతెలివి' అని లోకంలో వాడుక. ఏనుగు అంత భారమైన శరీరమును కూడా చాలా తేలిక చేసుకొని ఎంత ప్రవాహంలో నయినా తేలికగా ఈదుతుంది. అందువలననే 'గజఈత' అనే మాట వచ్చింది. సంసారమనే సాగరాన్ని గజతత్వం (వినాయకత్వం) అతి తేలికగా దాటవేయగలదు. గణపతి అంటే ఏనుగు తల, పెద్ద బొజ్జ పెట్టుకున్న వికారుడని భావించరాదు. సర్వప్రపంచమూ తనలో ఉన్నట్లు నిరూపించినవాడు వినాయకుడు. మంచి మనసుతో విఘ్నేశ్వరుని ఆరాధిస్తే విఘ్నములు లేకుండా కార్యాలు నెరవేరుతాయి. కనుక **'అవిఘ్నం కురుమేదేవ! సర్వ కార్యేషు సర్వదా!'** అని విఘ్నేశ్వరునికి కొబ్బరికాయ కొట్టటం మన సంప్రదాయము.

- సం.

# వినయం

"విద్యాదదాతి వినయం
వినయాత్ యాతి పాత్రతామ్
పాత్రత్వాత్ ధనమాప్నోతి
ధనాద్ధర్మం తతః సుఖమ్".

ఈ నీతి శ్లోకము మనకు సరియైన విద్యా స్వరూపమును చాటుచున్నది. "విద్య" అంటే కేవలం అక్షరస్వరూపమని భావించే వారికి ఈ శ్లోకం కనువిప్పు కలిగిస్తుంది.

విద్య యొక్క అసలైన ప్రయోజనం విజ్ఞానమును సముపార్జించడంతోపాటు వినయాన్ని కూడా అలవరచు కోవటం. వినయంలేని విద్య, సంస్కారం లేని చదువు ఉన్నా ప్రయోజనం లేదు. అత్యున్నతమైన సద్గుణములను పెంపొందించేదే సరియైన విద్య. సద్గుణములను పెంచుకోకుండా, కేవలం పరీక్షలలో బంగారు పతకములు సంపాదించుకున్నంత మాత్రమున ప్రయోజనం లేదు.

"విద్యా వినయ సంపన్నః" అని పెద్దలు ఏనాడో చెప్పారు. విద్యావినయములు రెండూ కలిసి ఉన్నవాడే రాణిస్తాడు, శోభిస్తాడు అభివృద్ధిలోనికి వస్తాడు. పూర్వకాలమున విద్యను నేర్చుకోవటానికి గురుకులానికి వెళ్ళేవాడిని 'వినేయుడు' అని పిలిచేవారు. అనగా వినయమును అభ్యసించే వాడని అర్థం. విద్యతోపాటు విధిగా వినయమును కూడా అలవరచుకోవాలని ఆనాడు భావించేవారు. అయితే ఈనాడు చాలామంది విద్యార్థులలో ఆ వినయం ఏమాత్రం కనిపించటం లేదు. మార్కులు, క్లాసులు, ర్యాంకులు బాగానే వస్తున్నాయిగాని వినయ విధేయతల విషయంలో మాత్రం చాల వెనుకబడి ఉన్నారు. మార్కులే ప్రధానం కాదు. మార్కులతో పాటు రిమార్కులు రాకుండా చూచుకోవాలి. విద్యే ప్రధానం కాదు. విద్యతో పాటు వినయాన్ని కూడా అలవరచుకోవాలి.

ఈరెండూ సంపాదించిన వారికి యోగ్యత, అర్హత లభిస్తాయి. తద్వారా మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించు కుంటారు. ఉన్నత పదవులను అధిష్ఠించగలుగుతారు. తద్వారా ధనమును సంపాదించగలుగుతారు. అట్టి ధనమును స్వార్థ భూయిష్టమైన పనులకు వినియోగించ కుండా, దాన ధర్మాలకు వినియోగిస్తే, సమాజంలో గౌరవ మర్యాదలు లభిస్తాయి. దాని వలన సుఖమును, ఆనందమును పొందుతారు. అదే విద్య యొక్క నిజమైన పరమావధి.

**కొమరగిరి కృష్ణమోహనరావు**

ఇదే భావమును ఈ నీతి పద్యము కూడా వివరిస్తున్నది.

*"విద్య యొసగును వినయంబు, వినయమునను*
*బడయు బాత్రత పాత్రత వలన ధనము*
*ధనము వలనను ధర్మంబు దాని వలన*
*ఐహికాముష్మిక సుఖంబులందు నరుడు"*

వినయ విధేయతలను పెంపొందించని విద్య ఉన్నా ప్రయోజనం లేదు. వినయము లేనివాడు ఏ రంగం లోనూ ప్రకాశించడు, రాణించడు, శోభించడు, పదిమంది చేత మెప్పునూ పొందలేడు. వినయశీలి మాత్రమే సర్వులనూ జయించగలడు. సమస్తమునూ సాధించ గలడు. విద్యకు వినయం తోడైనప్పుడే అట్టి విద్య రాణిస్తుంది.

ఎంతటి జ్ఞానులైనప్పటికినీ, వారిలో వినయ విధేయతలు గనుక లోపిస్తే, వారు కష్టించి, శ్రమించి, సముపార్జించిన జ్ఞాన తపస్సు 'బూడిదలో పోసిన పన్నీరు' వలె ఎందుకూ పనికిరాకుండా పోతుంది.

మనిషి విలువ అతని బాహ్య సౌందర్యము నందు లేదు. ఆస్తి పాస్తులయందు అంతకన్నా లేదు. వినయ విధేయతలలోనే ఉన్నది మనిషి విలువ.

కోపానికి పరాకాష్ట అయిన దూర్వాస మహా మునిని సహితం మృదుమధురమైన వచనములతో వశం చేసుకోవచ్చును. వినయ పూర్వకంగా స్వాగతం పలుకితే ఆగ్రహించేవారు సహితం అనుగ్రహిస్తారు. మన ప్రవర్తన ద్వారా కోపవంతుని కూడా శాంతింపచేయవచ్చును. మన ప్రేమ పలుకులతో కఠిన శిలలనైనా కరిగించ వచ్చును. మన జాలి చూపులతో పాషాణ హృదయాలనైనా ద్రవింప జేయవచ్చును. వినయ విధేయతలను ప్రదర్శించి ఎంతటి వారినైనా మన వైపు త్రిప్పుకొనవచ్చును. విద్వాంసుడు పండితుల చేత 'శభాష్' అనిపించుకోగలడు గాని, వినయ శీలి మాత్రం సర్వుల మన్ననలను పొందగలడు.

ప్రతి విద్యార్థి విద్యతోపాటు వినయమును కూడా అలవరచుకోవాలి. వినయ విధేయతలు గల వానికి జీవితంలో అపజయం అనేదే ఉండదు. కనుక ప్రతి విద్యార్థి విద్యా వినయ శోభితుడుగా వెలుగొందాలి.

*(ఆకాశవాణి సౌజన్యంతో ది. 14-7-98)*

## శ్రీవాణి జీవిత సభ్యులు



**Dr. G. BALA RAJU**

**Siddipet, Medak Dt.**

# శ్రీలలితా సహస్రనామ స్తోత్రమ్

విశ్వకళ్యాణ దృష్ట్యా ఈ సంవత్సరం శ్రీదేవీ నవరాత్ర దీక్షా మహోత్సవాల సందర్భంగా శాశ్వత సద్వినియోగార్థం - శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం (మణిద్వీపవర్ణన - వచనంతో) యొక్క లక్ష ప్రతులను దాతల సంపూర్ణ సహకారంతో ప్రచురించి వారి ద్వారానే విశ్వవ్యాప్తంగా గల శ్రీదేవీ భక్తులకు, మహిళా మండలులకూ, శ్రీదేవీ మందిర ఆలయ నిర్వాహకులకూ, శ్రీ లలితా సహస్రనామ స్తోత్ర పారాయణ పరాయణులైన సోదర సోదరీమణులకూ - ఎట్టి లాభాపేక్షా లేకుండా అందజేయించదలచినట్లు శ్రీ రాజరాజేశ్వరీ భక్తులైన శ్రీ పురాణపండ రాధాకృష్ణ మూర్తి పత్రికా ప్రకటన ద్వారా తెలియజేస్తున్నారు.

ఇందు నిమిత్తం 108 ప్రతుల వంతున వితరణ చేసికోదలచిన వారిని సాదరంగా 1000 మందినీ, 1000 ప్రతుల వంతున వితరణ చేసికోదలచిన వారిని 108 మందినీ ఆహ్వానిస్తున్నామన్నారు. అట్టి దాతలు చెల్లించవలసిన పైకం వివరాలనూ, శాంపిల్ కాపీని పొందగోరువారు రూ. 5-00 లు విలువ గల పోస్టల్ స్టాంప్సను మాత్రమే పంపాలని కూడ పత్రికా ప్రకటన ద్వారా తెలియజేశారు.

వివరాలకు :

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**
సంచాలకుడు - భాగవతమందిరం
సూర్యహోటల్ దగ్గర, రాజమండ్రి - 4.

# సాధన ఎందుకు ?

మేల్కోవటం Awareness కి సంబంధించినది.

నిద్ర Un-Awareness కి సంబంధించినది.

Awareness అంటే ఎరుకే! ఈ ఎరుక అనే దాన్ని భౌతిక స్థాయిలో, మానసిక స్థాయిలో, ఆధ్యాత్మిక స్థాయిలో కూడా ఒకేసారి అనుభవించగలగటాన్ని Total Awareness అంటారు. పూర్ణ ప్రజ్ఞావంతునికి జీవితంలోని ప్రతి క్షణం, ప్రతి ఆలోచనా, ప్రతి చర్యా ఈ రీతిగా భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక స్థాయిలలోని పరమార్థాన్ని గుర్తింపజేసేవిగా వుంటాయి.

మనం చేసే సకలమైన ఆధ్యాత్మిక సాధనల్లోనూ గల ఆంతర్యం ఈ "ఎరుక"ను ప్రాప్తింప జేసుకోవటమే! పూర్ణ ప్రజ్ఞాప్రాప్తికై జీవితమే ఒక సాధన కావాలి అని మహా పురుషులు ప్రబోధిస్తున్నారు.

**అనూహ్యమైన పరిణామాలు :**

భగవత్ సృష్టి అంతా పరిణామ శీలమైనదే! మనం చేసే మంచీ చెడూ, అంతా ఈ పరిణామంలోని వివిధమైన దశలే. కొందరు చెడ్డ పనులు చేస్తూనే ఉంటారు. ఒకనాటికి వారి చెడ్డపనుల చెడుఫలితాలతో వారి మనస్సులు ఎంతో దుఃఖాన్ని అనుభవిస్తాయి. మళ్ళీ ఈ చెడుదోవలోకి పోను, అనే నిశ్చయాత్మకమైన బుద్ధి కలుగుతుంది. ఆ మలుపుతో ఎంత చెడ్డ వాడు కూడా "మంచి" వైపు సాగిపోతాడు. చివరకు మంచికీ, చెడుకూ అతీతంగా ఎదుగుతాడు. అదే దివ్యపరిణామం.

కొందరు ఆధ్యాత్మిక సాధన అంటూ ఏమీ చేయరు. వారి బ్రతుకులు వారు బ్రతుకుతూ వుంటారు. అటువంటి వ్యక్తులను చూచి మనం జాలిపడుతూ వుంటాం, "వీరికి దేవుడు, దైవంతో పని లేదు. వీరి జన్మ వృథా" అనుకుంటాం. కానీ అలా భౌతిక స్థాయిలోనే సాగిపోయే వారి జీవితాల్లో ఒక్కసారిగా అనూహ్యమైన పరిణతి సంభవిస్తుంది.

ఒక ఉదాహరణ. శ్రీమతి ' R ' గారే! ఆమె ఒక గృహిణిగా భర్తతో, బిడ్డలతో సుఖంగా జీవితాన్ని గడుపుతూ ఉన్న తరుణంలో, భర్త చనిపోవటం, అనే ఒక హఠాత్ సంఘటనతో ఆమె జీవిత గమనమే పోయింది! ఊహించలేనిదీ, భరించరానిదీ, అయిన దుఃఖం ఆమె మనస్సును మార్చివేసింది! కదిలే మబ్బుల్లాంటి మానవ జీవితాల్లో ఈ సుఖాలు ఎంత అస్థిరమైనవో దురంతమైన ఆవేదన ద్వారా తెలియవచ్చాయి! దుఃఖ సముద్రంలో అట్టడుగు దాకా మునిగితే ఆమెకు ఏదో శాశ్వతమైన ఆనందం యొక్క స్ఫురణ దొరికింది. అశాశ్వతమైన దానికోసం ఏడ్చిన ఏడ్పులో నుంచి, శాశ్వతమైనదేదో ఈమె

## పాతూరి ప్రసన్నం

మనస్సుకు తోచింది. భర్తలేని జీవితం ఒక అంధకార మయమైనదే ప్రతి స్త్రీకి! కానీ ఆ అంధకారంలో నుంచే ఆత్మప్రకాశ కిరణాలను ఆమె చూడగలిగింది! ఈ ఆంతరిక పరిణతి యొక్క ప్రతి ఫలంగా ఆమె దివ్య భావాలతో, దివ్యానందంతో నిండిన ఒక కొత్త జీవితాన్ని ప్రారంభించింది. ఖరీదైన వస్త్రాలను, వస్తువులను, భౌతికమైన విలువలతో కూడిన వాటినన్నింటినీ విడిచివేసి, ఒక చిన్న గదిలో బ్రతకటానికి కావలసిన అత్యవసరమైన పదార్థాలతో కోరి వరించిన సరళ జీవనంతో పదిమందిలో వుంటూనే ఒంటరి జీవితాన్ని గడుపుతోంది. ఒక విధమైన MYSTICAL PLANE లో బ్రతుకుతోంది! ప్రతి క్షణమూ దివ్యానుభూతులే! ఇలాంటి పరిణామం తన జీవితంలో కలుగుతుందని ఆమె ఎన్నడూ గతంలో కలలో కూడా అనుకోలేదు! అదే మనం ఊహించని దివ్యమైన ఆధ్యాత్మిక పరిణామం!

ఈనాడు భగవాన్ శ్రీసత్యసాయిబాబా వారి అనేకమంది భక్తుల జీవితాల్లో చోటు చేసుకొంటున్న

అనూహ్యమైన ఆధ్యాత్మిక పరిణామం యిటువంటిదే! గతంలో తినటం, త్రాగటం, భోగ భాగ్యాలు అనుభవించటమే ఈ మానవ జీవితానికి పరమార్థం అనుకొనే వారు కూడా భోగభాగ్యాలను తృణప్రాయంగా చూస్తూ, సరళ జీవితాన్ని వరించి, దైవప్రేమ, లోకసేవ అనే రెండు దివ్యమైన ఆశయాల కోసం ఈనాడు ఉత్తమశ్రేణి మానవతకు చిహ్నంగా జీవిస్తున్న వారు ఎందరో భగవాన్ బాబా భక్తులలో వున్నారు!

### దుఃఖ స్వరూపం

సుఖం వెంట దుఃఖం, దుఃఖం వెంట సుఖం యిదే మానవ జీవితం అని గుర్తిస్తే చాలు! ఈ రెంటికి అతీతంగా మనస్సు వెళ్తుంది! "న సుఖాల్లభ్యతే సుఖం'. సుఖం చేత సుఖం రాదుట! జీవితంలో కష్టాలను వరించి, వాటిని స్వీకరించి, ధీరులై నిలబడగలిగిన వారికి నిజమైన సుఖం లభిస్తోంది! అటువంటి దుఃఖాన్ని అధిగమించి నిజమైన శాశ్వతమైన ఆనందం కోసం చేసేదే ఆధ్యాత్మిక సాధన! కాబట్టి విషయ, యింద్రియ సంయోగం చేత కలిగే సుఖం నిజమైన సుఖంకాదనీ,. అదే దుఃఖ స్వరూపమనీ తెలుసుకోవటమే ఈ సాధనకు ప్రారంభస్థితి!

వివిధమైన ఆధ్యాత్మిక సాధనల ద్వారా విషయ సుఖాలకు అలవాటు పడిన ఈ యింద్రియాలు క్రమక్రమంగా విషయ సుఖాలకు విముఖములవుతాయి! క్రమశిక్షణ, తీవ్ర పరిశ్రమ, కష్టములను సహించటం వంటి సుగుణాలతో నిండిన మనస్సు సాధనలో ఎంతో ముందుకు పోతుంది.

ఒక విధంగా లేమిలో, దారిద్ర్యంలో బ్రతికేవారు ఎంతో అదృష్టవంతులనిపించుతుంది! కారణం? వారికి సుఖాలపట్ల ఏమాత్రమూ మోజుకూడా లేకపోవటమే! మహాభక్త విజయం వంటి గ్రంథాలను చదివితే మహాభక్తులందరూ దారిద్ర్యంలో పుట్టినవారూ, లేదా దారిద్ర్యాన్ని కోరి తెచ్చుకున్న వారూ అని తెలుస్తుంది! అష్టైశ్వర్యాలనూ అనుభవించగలిగిన బెంజిమిన్ ఫ్రాంక్లిన్, ఆల్బర్ట్ స్వీట్జర్ వంటి ఆధునిక యుగంలోని సైంటిస్టులు, మేధావులు, నోబుల్ బహుమతి గ్రహీతలూ కూడా వారు తమ జీవితాల్లో భోగభాగ్యాలకూ, సుఖమయ విలాసజీవితాలకూ స్వస్తి చెప్పి ఏమీలేని వారివలె, లేనివారి సేవలో తమ జీవితాలను ధన్యం చేసుకున్నారు! ధన వ్యామోహం, ధనం ద్వారా సుఖపడతామన్న, ఒక భ్రాంతి మనిషి యొక్క పతనానికే గానీ ఉన్నతికి ఈనాడు సహకరించటంలేదు! నిజమైన సుఖం, నిజమైన ఉన్నతి మనిషికి కలుగవలెనంటే ఆ ధనాన్ని ఎంతలో వుంచాలో అంతలోనే వుంచాలి. దాన్ని కూడా సమాజరూప సర్వేశ్వర సేవలోకి వినియోగించక తప్పదు! డబ్బు - కోరికలు - విషయసుఖాలూ - మనస్సు తద్వారా యింద్రియాలకు బానిసకావటం - అలా దిగజారిపోయిన మనస్సు మనిషిని మానవత్వం నుంచి అధోగతికి కూల్చివేసి పశుజన్మల స్థితికి నెట్టివేయటం వంటివి ఒకదాని తర్వాత ఒకటిగా సంభవించే దుస్థితులే - దుర్గతులే!

కాబట్టి అటువంటి విషయ సుఖాలకు విముఖతమైన మనస్సు నిరతిశయ సుఖాన్ని మాత్రమే పొందుతుందనే పరమ సత్యాన్ని "శ్రీ సీతారామాంజనేయ సంవాదం" అనే మహాగ్రంథం వివరిస్తుంది.

*ఖంబు సుమీ, మతి విషయ సు*
*ఖంబు సుమీ, త్రిజగదభి ముఖంబు సుమీ- దుః*
*ఖంబు సుమీ, యది - తద్విము*
*ఖంబు సుమీ, నిరతిశయ సుఖంబు కపీంద్రా!*

*(2వ ఆశ్వాసం , 127 పద్యం)*

## ఒంటిగనే.........

ఒంటి త్రాటితో
శిఖరారోహణం చేయాలి
ఒకే తెడ్డు నావతో
సంద్రాలు దాటాలి
ఒంటిగనే ఆత్మతో
అనంతత్వ మొందాలి
ఒంటి శ్వాసల మెసలతో
మిండికెగర జూడాలి
ఏక తులసిదళ సమర్పణతో
శ్రీకృష్ణ సాన్నిధ్య మొందాలి.

**డా॥ రాపర్ల జనార్ధనరావు**

...స్సు విషయ సుఖాల వెంటపడి, ఈ ముల్లోకాలలో ఎక్కడా నిజమైన సుఖాన్ని పొందలేదు, విషయ సుఖాల్లో నిజమైన సుఖంలేదు. అటువంటి ఐహిక సుఖాలకు విముఖం కావటంలోనే నిరతిశయమైన సుఖం వుంది", అని ఆంజనేయస్వామికి శ్రీరామచంద్రుల వారు బోధిస్తారు!

ప్రతి జీవి ఈ సృష్టిలోని వికాస క్రమంలో తన నిజస్వరూపాన్ని తాను గుర్తించేదాకా ఎదగవలసినదే! అందుకే జన్మజన్మాంతరాలు!

"A hidden bliss is at the root of things",

"To house God's joy in things space gave wide room",

" To house God's joy in self our souls were born",

సృష్టి రహస్యాన్ని వివరిస్తూ శ్రీ అరవిందయోగి 'సావిత్రి' మహా కావ్యంలో వెలిబుచ్చిన మాటలుఇవి! "ఈ సృష్టిలోని ప్రతి పదార్థంలోనూ మూలంలో అంతర్గర్భితంగా వున్నది ఆనందమే! ఈ సృష్టిలోని పదార్థములన్నింటిలోనూ భగవత్స్వరూపమైన ఆనందమే నిహితమై వున్నది! మనం అందరం పుట్టినది కూడా మన అంతరాత్మల్లో నెలకొనివున్న భగవదానందాన్ని వ్యక్తం చేయుటానికే'', అంటారు శ్రీఅరవిందులు! అదే విషయానందానికి భిన్నమైన నిరతిశయానందం యొక్క లక్షణం!

అయితే ఈ విషయ యింద్రియాల కలయిక ద్వారా కలిగే భౌతిక, శారీరక ఆనందం కూడా పైన పేర్కొన్న నిరతిశయానందం యొక్క లేశమే అంటుంది తత్త్వశాస్త్రం!

"There is joy in all that meets the sense,
A Joy in all experience of soul,
A Joy in evil and a joy in good,
A Joy in virtue and a joy in sin"

(Savitri - Book X Canto - III)

"ఇంద్రియాలు స్పృశించే ప్రతి విషయంలోనూ ఆనందం వుంది. ఆత్మ అనుభవించే ప్రతి అనుభూతి లోనూ ఆనందం వుంది. కీడులోనూ, మంచిలోనూ, పుణ్యంలోనూ, పాపంలోనూ అంతటా ఆనందమే'' - ఈ రీతిగా ఈ సృష్టి అంతా పరమాత్మని ఆనందక్రీడగా వర్ణించబడింది సావిత్రి మహాకావ్యంలో!

## సాధన ఎందుకు?

సాధన అనేది బలహీనుడైన మనిషిని బలవంతుడ్ని చేయటానికే! దుఃఖంలో కూరుకుపోయిన వారిని అటువంటి దుఃఖంనుంచి విముక్త పరచటం కొరకూ, ముందుగానే మేల్కొన్న వారిచేత నిత్యనిరతిశయ సుఖాన్ని అనుభవింపజేయటం కొరకూ సాధన కావాలి!

స్వస్వరూపాన్ని, నిజతత్త్వాన్ని, అనుభవించటం కొరకు సాధన చేయాలి. సాధన అనేది పరలోక సుఖం కొరకే అనుకోవటం పొరపాటు. ఐహికంగా కూడా ఎన్నో ప్రయోగాలు సాధన ద్వారా సమకూరుతాయి.

అటువంటి సాధన ఆంతర్యాన్ని క్రమంగా తెలుసుకుందాం.



# నామాలులేని దేవుడు

ఏడు కొండలవాడు ఎర్ర అంగీ దాల్చి
ముడుపు లడగకుండ ముందుకొచ్చె
విశ్వేశ్వరుడు తాను విభూతి తీసేసి
భక్తులందరి తోను పలుకవచ్చె
శేష శయనుడు నేడు శంఖ చక్రములేక
దుష్ట శక్తుల దుమ్ము దులపవచ్చె
దక్షిణామూర్తియు దాక్షిణ్యమును జెంది
తత్త్వ బోధను చేయ తరలివచ్చె
సర్వ దైవత రూపుడు సాయిబాబా
నిఖిల భక్తాళికి పూజ నీయుడయ్యె
క్షణము పోయిన యీ ఛాన్సు దక్కదెందు
తరలి రారండి మీ జన్మ ధన్యమొంద.

- ఆదూరి శ్రీనివాసరావు

# మహిళావిజయం

అదొక మహారాజుగారి సభాభవనం. ఆయన తత్త్వవేత్త. ఆనవాయితీ ప్రకారం మేధావులకొక పోటీ ఏర్పాటు చేశాడు. పోటీలో గెలిచిన వారికి గొప్ప బహుమానం ఇవ్వబడునని ప్రకటించాడు. ఈసారి పోటీలో విజేతలకు వేయి ఆవులను బహుమతిగా ఇస్తామని, ఆ గోవుల కొమ్ములకు వజ్రఖచిత బంగారు కవచాలు తొడుగుతాము అని ప్రకటించాడు.

ఆ కాలంలో యాజ్ఞవల్క్యుడు మహా విద్వాంసుడని పేరు గాంచాడు. తాను తప్పక విజయం సాధిస్తానన్న ధైర్యంతో సభకు వచ్చాడు. అతని శిష్యగణం వెంబడించింది. సభా భవనం ముందు అందమైన గోగణాన్ని, వాటి కొమ్ములకు అలంకరించిన స్వర్ణకవచాలను చూచి మురిసిపోయాడు. సభకు ప్రవేశించి మహారాజును ఉద్దేశించి మాట్లాడుతూ“ఈ గోగణాన్ని మా శిష్యులకు అప్పగించండి, వాటిని ఎండలో ఉంచటం భావ్యంకాదు.” అన్నాడు.

పోటీ జరిగి, గెలుపు ఎవరిదో తేలిన తర్వాత గోవులను మళ్ళించవచ్చు అన్నాడు మహారాజు. సభలో నున్న పెద్దలు, మహారాజుగారి ప్రకటనను సమర్థించారు. యాజ్ఞవల్క్యుడు మాత్రం, నన్ను జయించగల ప్రజ్ఞానిధులెవరు? అంటూ శిష్యులకు గోవులను తరలించవలసినదిగా ఆదేశించ్చాడు.

ఇంక యాజ్ఞవల్క్యుడు 'విజయుడు' అని ప్రకటించవలసి ఉంది. సరిగా ఆ సమయానికి గార్గి అన్న మహిళ సభలో ప్రవేశించి, “మహారాజా చర్చ సాగించనివ్వండి. విజయప్రకటన చేయకండి” అంటూ రాజును కోరింది. సభ స్తంభించిపోయింది. అంతమంది ప్రజ్ఞానిధులున్న సభలో, ఒక స్త్రీ సవాలు విసరడం అందరినీ ఆశ్చర్యచకితులను కావించింది. సరే చర్చ కానివ్వండి అన్నాడు మహారాజు.

గార్గి చిన్న ప్రశ్నవేసింది.“ఈ ప్రపంచాన్ని నిర్మించిన వారెవరు?” యాజ్ఞవల్క్యుడు ఘొల్లుమని నవ్వాడు. అదొక పనికి గాని ప్రశ్న అనుకొన్నాడు.

‘ఈ ప్రపంచాన్ని దేవుడు నిర్మించాడు. ఎందుకంటారా? ఇప్పుడున్నదానిని ఎవరో ఒకరు నిర్మించి ఉండాలికదా? నిర్మాత దేవుడే.

యాజ్ఞవల్క్యుడు తెల్లబోయాడు. ఇరుకులో పడ్డాడు. దేవుణ్ణి ముందు సృష్టించిన వారు దేవుడే అని సమాధానం చెప్పినా, ప్రశ్న ప్రశ్నగానే మిగులుతుంది. దేవుణ్ణి కూడా ఎవరో పుట్టించి ఉండాలి. అతడే మొదటి వాడని చెప్పలేం.

## జానమద్ది హనుమచ్ఛాస్త్రి

యాజ్ఞవల్క్యుడు క్రోధావేశంతో “ ఓ మహిళా! చాలించు నీ వాదం. లేకున్న నీతల తెగుతుంది.”అన్నాడు.

గార్గి ఏమాత్రం జంకలేదు. అంతే ధీటుగా సమాధానమిస్తూ “ముందు మీ ఖడ్గాన్ని ఒరలో దూర్చండి. ఖడ్గం మీ వాదం కాదు. మహారాజా వెంటనే వేయి ఆవులను మరలించవలసినదిగా ఆదేశించండి.”

యాజ్ఞవల్క్యుడు ఇంత అవమానాన్ని తన జీవితంలో ఏనాడూ అనుభవించలేదు. ఇట్టి మేధాస్పర్థలో పాల్గొననూలేదు.

యాజ్ఞవల్క్యుడు నుండి వావను చేయించుకొన్న వేయి ఆవులను మహారాజు గార్గికి బహుమానంగా ప్రకటించాడు. జ్ఞానమేరువుగా గార్గి మన్ననలందుకొన్నది.

*(రజనీష్ ప్రసంగాల ఆధారంగా)* ☆

# పెట్రోల్ పంపు

ఆంగ్ల భాషలో "Necessity is the mother of all inventions" అని ఒక నానుడి ఉంది. దీని భావం మనం వాడే యంత్రాలూ, పరికరాలూ అన్నీకూడా నిత్యావసరాలను తీర్చేటందుకు కనుగొనబడినవే- లేదా రూపొందింపబడినవేనని. అయితే కొత్త పరికరాలను, యంత్రాలను రూపొందించడానికి పరిశోధనలు చేయడం ఒక ఎత్తయితే, ఇతరులు ఎదుర్కొంటున్న సమస్యలకి తమ పరిశోధనల ద్వారా పరిష్కారం కనుగొన యత్నించడం మరొకటి. ఒక్కొక్కప్పుడు ఇటువంటి పరిష్కారాలు సాంకేతిక ప్రగతి అద్భుతంగా సాగడానికి దోహద పడతాయి. ఇందుకు ఉదాహరణగా పెట్రోలుపంపును తీసుకొనవచ్చు. వాస్తవానికి ఇది ఒకందుకు కనిపెడ్తే మరొకందుకు ఉపయోగపడింది.

అమెరికాలోని ఇండియానా రాష్ట్రంలోని ఫోర్ట్‌వేన్‌లో జేక్‌గంపర్ అనే కిరాణా వ్యాపారి ఉండేవాడు. వ్యాపారంలో సహజంగా ఎన్నో సమస్యలు సతమతం చేస్తుంటాయి. అయితే ప్రధానంగా ఆయన్ని పీడిస్తూ వచ్చిన సమస్య కిరోసిన్‌తో వచ్చిపడింది. పీపాలోనుంచి దానిని తీసేటపుడు ప్రక్కనే ఉన్న వెన్నమీద కొద్దిగా చిందడమో లేదా కారడమో జరుగుతుండేది. కిరోసిన్ వాసన వేసే వెన్నను కొనడానికి వినియోగదారులు ఇష్టపడే వారు కాదు. పోనీ వెన్నను మరోచోటికి మారుద్దామన్నా లేదా కిరోసిన్ డబ్బానే మరోచోట పెడ్దామన్నా మరో వస్తువుమీద అది ఒలికో, చిందో ఖరాబు కావడం తప్పదు. ఇలా ఉండగా ఒకరోజున గంపర్ దగ్గరకి ప్రక్క దుకాణంలో ఉండే సిల్వానస్ బేజర్ అనే స్నేహితుడు వచ్చాడు. అతని ముందు తన గోడు వెళ్ళబోసుకున్నాడు జేక్. ఇద్దరూ ఆసమస్య పరిష్కారం గురించి చాలాసేపు చర్చించారు. ఆతర్వాత బేజర్ వెళ్ళిపోయాడు. జేక్ అంతటితో ఆ విషయాన్ని వదిలేసినా బేజర్ మస్తిష్కాన్ని మాత్రం ఆ ఆలోచన మధిస్తూనే ఉండింది.

కొన్నాళ్ళపాటు మిత్రులిద్దరూ కలుసుకోలేదు. అయితే ప్రతిరోజూ బేజర్ దుకాణంలో నుంచి సుత్తి దెబ్బలు, లోహాలచప్పుళ్ళు, వినిపిస్తూండేవి. కాని వాటిని గురించి జేక్ గంపర్ ఏమీ పట్టించుకోలేదు.

అది 1885వ సంవత్సరం సెప్టెంబర్ 5వతేదీ. బేజర్‌గంపర్ దుకాణంలోకి ఒక పెద్ద వస్తువుతో ప్రవేశించాడు. కౌంటర్‌మీద దానిని ఉంచాడు.

ఆ వస్తువువంక ఆసక్తితో చూశాడు గంపర్.

**కె. ఆర్. కె. మోహన్**

అది ఒక గుండ్రని టాంక్. దానిలో పిస్టన్ సిలిండర్, కొన్ని మార్బుల్ వాల్వులు, బయటకి కనిపిస్తున్న ఒక పైప్ ఉన్నాయి. అది మరేదీ కాదు. సిల్వానస్ మస్తిష్కంలో ఆలోచనగా అంకురించి ఓ పరికరంగా రూపుదిద్దుకున్న పంప్.

సిల్వానస్ బేజర్ అది పనిచేసే విధానాన్ని ప్రదర్శించి చూపాడు. దాని హేండిల్‌ని పైకి ఎత్తగానే, టాంక్‌లోంచి ఒక గాలన్ కిరోసిన్ సిలిండర్‌లోకి వచ్చింది.

## సుభాషితములు

"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్యమప్రియం
ప్రియం చ నా నృతం బ్రూయాత్
ఏష: ధర్మ: సనాతన: ".

సత్యమును పలుకవలెను, ప్రియముగా పలుకవలెను. సత్యమైననూ అప్రియముగా పలుకరాదు, ప్రియముగా నైననూ అసత్యమును పలుకరాదు. ఇది సనాతనమైన ధర్మము.

.ఆ హాండిల్‌ని క్రిందకు నొక్కగానే ఆ కిరోసిన్ బయటికి గొట్టంద్వారా వేగంగా బయటకి వచ్చి క్రింద ఉంచిన బకెట్‌లో పడింది. ఆ వింతను చూసి గంపరే కాకుండా షాప్‌కి వచ్చినవారు కూడా విస్తుపోయారు. అంతటితో జేక్‌గంపర్‌కి కిరోసిన్ కష్టాలు గట్టెక్కాయి. అంతేకాదు ప్రపంచంలోని తొలి ఆయిల్ పంప్‌కు సొంతదారు డయ్యాడు.

ఇది జరిగింది అమెరికాలో. సరిగ్గా అదే సంవత్సరం అట్లాంటిక్ మహాసముద్రానికి ఆవలివైపున జర్మనీలో కార్ల్‌బెంజ్ అనేవ్యక్తి గుఱ్ఱపు బగ్గీకి ఇంటర్నల్ కంబస్టన్ ఇంజన్ అమర్చి యాంత్రికంగా నడపడానికి ప్రయోగాలు చేస్తుండేవాడు. త్వరలోనే అందులో విజయం సాధించాడు కూడా. ఇంటర్నల్ కంబస్టన్ ఇంజన్ తయారు కావడంతో అందులో ఇంధనంగా ఉపయోగించే 'మోటార్ స్పిరిట్'ను వ్యాపార సరళిలో ఉత్పత్తి చేయడం ఇంగ్లండ్‌లో ప్రారంభమయింది. కార్లెస్ కాపెల్ లెనార్డ్ అన్న కంపెనీ 1891లో ప్రత్యేకంగా శుద్ధిచేసిన పెట్రోల్‌ను ఉత్పత్తి చేయడం మొదలు పెట్టింది. ఈ ఇంధనాన్ని మోటారు బోట్లు నడపడానికి ఉపయోగించేవారు. మొదట్లో ఈ ఇంధనాన్ని "లాంచ్ స్పిరిట్" అన్నపేరుతో పిలిచే వారు. అయితే 1893లో ఒక కస్టమర్ సూచన మేరకు దీనికి స్టాండర్డ్ పెట్రోల్ అని పేరు పెట్టారు. ఈ వ్యాపార నామమే స్థిరపడిపోయింది. అటు తర్వాత ఈ కంపెనీ 1899 నాటికి దేశవ్యాప్తంగా 1600మంది రిటైల్ ఏజంట్లను నియమించింది. అయితే ఇప్పటిలాగా సర్వీస్ స్టేషన్‌లు, గరాజ్‌లూ ఉండేవి కావు. ఇంగ్లాండ్ ప్రజలు తమకు కావలసిన పెట్రోల్‌ను సైకిల్‌షాపుల్లోనూ, కిరాణా కొట్లలోనూ, కమ్మర్ల దగ్గరా, కొవ్వొత్తి వ్యాపారుల దగ్గర-ఇలా ఎక్కడపడితే అక్కడ కొనుక్కొంటుండేవారు. కాని ఈ విషయంలో అమెరికన్‌ల ఆలోచనలు భిన్నంగా ఉండేవి.



1905లో హారీ గ్రెన్ ... క్రమ్ లాంసింగ్ అనేవారు అమెరికాలోని మిస్సోరి రాష్ట్రంలోని సెయింట్‌లూయి వద్ద ఆటోమొబైల్ గాసోలిన్ కంపెనీ అనేదానిని స్థాపించారు. ఇక్కడే మొట్టమొదటి పెట్రోల్ ఫిల్లింగ్ స్టేషన్ ని ఏర్పాటు చేశారు. ఇక్కడ మోటారిస్టులు గ్రవిటీ టాంక్‌కి అమర్చిన గార్డెన్ హోస్‌ద్వారా పెట్రోలును పొందేవారు. అదే సంవత్సరం సిల్వానిస్‌బౌజర్ సెల్ఫ్‌మెజరింగ్ పంపును కూడా రూపొందించడంతో పెట్రోల్ పంపు చరిత్రలో నూతన శకం ప్రారంభమయింది.

ఈనాడు మనం చూస్తున్న ప్రొజెక్టింగ్ కానోపీ (Projecting Canopy) వుండే సర్వీస్ స్టేషన్‌ను 1907లో 'స్టాండర్డ్ ఆయిల్ ఆఫ్ కాలిఫోర్నియా' అన్న కంపెనీ తొలిసారిగా సియాటిల్‌లో నిర్మించింది. మూడేళ్ళ తర్వాత సెంట్రల్ ఆయిల్ కంపెనీ డెట్రాయిట్‌లో కవర్డ్ డ్రైవ్ ఇన్ స్టేషన్స్ (Covered Drive in Stations) నిర్మించింది.

1912 నాటికి టెన్నెసీలోని మోఫిన్ దగ్గర 13 పంప్ ఫిల్లింగ్ స్టేషన్లని నిర్మించారు. ఇక్కడ లేడీస్‌కి రెస్ట్‌రూమ్ ఏర్పాటుచేయడంతోపాటు, ఎండలో వచ్చే దూర ప్రయాణీకులకు ఐస్‌వాటర్ ఇచ్చేవారు. ఈ విధంగా సర్వీస్ స్టేషన్‌లు అన్నివిధాలా అభివృద్ధిని త్వరితగతిన సాధిస్తూ వచ్చాయి. బేజర్ తాను రూపొందించిన పెట్రోల్ పంపుకి పేటెంట్ తీసుకుని ప్రపంచ వ్యాప్తంగా తన వ్యాపారాన్ని సాగిస్తూ కోటీశ్వరుడయ్యాడు. అయితే ఇందుకు పరోక్షంగా కారణభూతుడైన జేక్ గంపర్ మాత్రం వెన్న, కిరోసిన్, చిల్లరసామాన్లు అమ్ముకుంటూ ఉండి పోయాడు. ✿

# పవిత్రత

ఒక ఆదర్శమయ జీవన విధానం కోసం- నీతి, న్యాయం, ధర్మం- వంటి మార్గదర్శక సూత్రాలను ఋషి ప్రోక్తమైన మన వాఙ్మయం సూచిస్తున్నది. ఈ ధర్మాలను మనం ఆత్మతో దర్శించి, మన దైనందిన జీవితంలో ఆచరణాత్మకంగా అన్వయింపచేసుకోవలసి యున్నది. అప్పుడే ఆయా ధర్మాల తత్త్వాలు, విలువలు మనకు తెలిసి వస్తాయి. 'పవిత్రత' - అనే శబ్దమూ. ఆ శబ్దము వెనుక ఉండే అంతర్లక్షణమూ - ఇటువంటి ధర్మానికి అనుబంధంగా ఉండే విషయమే! పరిశుద్ధము - వ్రత శౌచాదులచే శుద్ధమైనది. పాపాదులను పోగొట్టునది- అన్నవి - ఈ 'పవిత్రత' - అనే పదానికి నిఘంటువులు చెప్పే నిర్వచనం! ఇట్లా అన్నప్పుడు ఎవరికైనా ఒక అనుమానం కలుగవచ్చు. ఈ పవిత్రత- పరిశుద్ధత- అన్నవి కేవలం మతపరమైన,పారమార్థిక సంబంధమైన అంశాలు మాత్రమేనా? కాక, ఒక ప్రవృత్తి పరమైన అంశంగా మారి , మనిషి జీవితంలో వెలుగును ప్రసరింపజేసి, ఒక సార్థకతను చేకూర్చే లక్షణం ఉండి ఉంటుందా ?

ఆలోచిస్తే - ఈ రెండులక్షణాలు కలిగి ఉండి, మన భౌతిక, ఆధ్యాత్మిక జగత్తులు రెండింటినీ ప్రభావితం చేసే ఒక సంస్కార రేఖ - ఈ 'పవిత్రత' - అన్న భావం మనసుకు తోస్తుంది. మనకు పంచభూతాలు పవిత్రమైనవి. సమస్త కల్మషాలనూ హరించే శక్తి కలవి కనుక. మనకు ప్రార్థనా స్థలాలు పవిత్రమైనవి. మనలను కాపాడే దైవం అక్కడ కొలువుంటాడని విశ్వసిస్తాం కనుక. మనకు మతగ్రంథాలు పవిత్రమైనవి. మన ఐహికాముష్మిక జీవనపథాన్ని అవి తీర్చిదిద్దుతాయని నమ్ముతాం కనుక!

పవిత్రతకు సంబంధించిన ఈ నమ్మకాలన్నిటి వెనుక ఉన్న బలీయమైన అంశం - పారమార్థికమైనది.

లౌకిక.జీవన వ్యవహారంలోనూ - ఈ పవిత్రత- అన్న లక్షణం మీద మనం ఏర్పరచుకొన్న విలువలూ, విశ్వాసాలూ కొన్ని ఉన్నాయి. పవిత్రత - శరీరానికీ, మనస్సుకూ కూడా ఉండాలన్నది - మన భారతీయ సంస్కృతిలోని ప్రధానాంశం! సీత - అగ్నిలో దూక వలసి వచ్చింది - తన పవిత్రతను నిరూపించు కోవటం కోసం! 'విశుద్ధ భావాం నిష్పాపాం ప్రతి గృహ్ణీష్వ రాఘవ'అని సాక్షాదగ్ని దేవుడు సాక్ష్యం పలక వలసి వచ్చింది!

## సి. వేదవతి

అగ్నివంటి ఆ పవిత్రతే - మన సంస్కృతీ వార సత్వానికి ఆయువు పట్టుగా నిలిచిన మాట నిజం ! తీర్థ యాత్రల వల్లా, కోనేటి స్నానాల వల్లా ఆత్మకు సంతృప్తి కలిగే మాట నిజమే ! అంతమాత్రం చేత - మనశ్శరీరాలు పునీతమై పోయాయనుకోవటం సరికాదు! కేవలం వ్రతాలూ, పూజలూ చేయడం వల్లనే పవిత్రత సాధ్యం అయ్యేది కాదు, ఆత్మశుద్ధికి ఎంతో సాధన కావాలి. ఒక విశుద్ధమైన జీవన సంస్కారం కావాలి. ముందు మనకు పవిత్రంగా జీవించడం ఎట్లానో తెలియాలి! మనోవాక్కాయ కర్మలలో ఒక పరిశుభ్రతను నిలుపుకోవాలి. పరిశుద్ధమైన ఆలోచన, మృదువైన వాక్కు, శుభ్రమైన శరీరం, పరహితార్థమైన కర్మానుచరణం - ఇవన్నీ మనిషికి పవిత్రతను ఇస్తాయి. అప్పుడా పవిత్రత తాలూకు శుభ్ర సౌందర్య తేజం - మనిషి వ్యక్తిత్వానికి గొప్ప వెలుగును ప్రసాదిస్తుంది.

"పూజించే చేతుల కన్నా, పని చేసి, సహాయపడే చేతులు గొప్పవి" - అంటాడు 'సారోయిన్' అనే పాశ్చాత్య మేధావి. అవును! శ్రమించడంలో ఒక పవిత్రత ఉంది! పరులకు సహాయ పడటంలోను, పరుల ఆర్తినీ, దుఃఖాన్నీ ఉపశమింప చేయటానికి తోడుపడటంలోనూ ఉంది పవిత్రత! కరుణలోనూ, ప్రేమలోనూ నిండి తొణికిస లాడేది పవిత్రత! మనిషిని మనీషిని చేసే ఈ పవిత్రతా లక్షణం - మనకిపుడెంతో అవసరం !



# అభినవ రాజరాజనరేంద్రుడు
# వాసిరెడ్డి చంద్రమౌళీ ప్రసాద్

దాదాపు వెయ్యిసంవత్సరాల క్రితం తూర్పు చాళుక్య ప్రభువు రాజరాజనరేంద్రుడు గోదావరీ తీర రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకొని పరిపాలిస్తూ ఆదికవి నన్నయ భట్టారకుని ప్రోత్సహించి ఆంధ్ర మహాభారత రచనకు ఉపక్రమింపచేశాడు. కాని నన్నయ రెండున్నర పర్వాలు తప్ప పూర్తిచేయలేకపోయాడు. తర్వాత శతాబ్దం దాటిన తర్వాత కాని పినాకినితీరవాసి తిక్కన ఆ తర్వాత ఎర్రాప్రగడ చేయివేస్తే కాని మహా భారత రచన పూర్తికాలేదు. అంటే, ముగ్గురు పూనుకుంటే, కానీ అనేక సంవత్సరాలు గడిస్తేకాని ఆంధ్ర మహాభారత రచన పూర్తికాలేదు.

నన్నయతర్వాత దాదాపు వెయ్యిసంవత్సరాలకు కృష్ణానదీ తీర ముక్త్యాల (ముక్తినీల) సంస్థానాధీశుడు వాసిరెడ్డి చంద్రమౌళీ ప్రసాద్ గారు గోదావరి తీర రాజమహేంద్ర వాస్తవ్యుడైన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారిని ప్రోత్సహించి వ్యాస భారతానికి యధా తధ అనువాదం చేసేట్టు ప్రోత్సహించారు. ఆనాడు రాజరాజ నరేంద్రునికి దక్కని అదృష్టం చంద్రమౌళీశ్వర ప్రసాద్‌కు దక్కింది.

సుమారు అరువది వేల గద్యపద్యాలతో కూడిన మహాగ్రంధమిది. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు ఈ మహత్తర గ్రంథాన్ని పూర్తి చేయడానికి దాదాపు పన్నెండు సంవత్సరాలు పట్టింది. ఇంతకాలం నెలకు నూట పదహారు రూపాయలు చొప్పున చంద్రమౌళీప్రసాద్ డబ్బు పంపిస్తూ వుండేవారుట. ఈ మధ్యలో శాస్త్రిగారి కుమార్తెల వివాహాలు వస్తే అన్ని ఖర్చులూ తను భరించి వివాహాలు జరిపించారు. చంద్రమౌళీ ప్రసాద్ శాస్త్రిగారిని తన ఆస్థాన నరేంద్రునిగా గౌరవించి ఆదరించేవారు. శాస్త్రిగారిని ఆయన తనకు ఇష్టునిగా, మిత్రునిగా, గురూత్తమునిగా చుట్టంబుగా భావించి ఆదరించేవారుట. రాజరాజ నరేంద్రుడు నన్నయ్యను ఎంతగా గౌరవించి పూజించేవారో చంద్రమౌళీ ప్రసాద్ అంతగాను [illegible] ఆదరించేవారు.

ఒకసారి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు చంద్రమౌళీ ప్రసాద్ గారిని సందర్శించి ఆయన అదృష్టాన్ని వర్ణిస్తూ

"గోదా తీరమునందు భారతము దిక్కూలంక షోద్య ధ్యశః
ప్రాదుర్భావుడు రాజరాజు లెనింగింపంజేసె గృష్ణానదీ
భూదారుండవు నీవు నట్టి పనికే భూయః ప్రయత్నము నా
పాదింప గలవాడవై యశము సంపాదించిలన్ భూపతి"

అని అన్నారుట.

శ్రీకృష్ణ మహాభారతానికి పూర్వమే శాస్త్రిగారు వేదాద్రి మహాత్మ్యము అనే క్షేత్ర ప్రశంసగల ఐదు ఆశ్వాసాల కావ్యాన్ని రచించి చంద్రమౌళీ ప్రసాద్ గారికి అంకితం

## కంచి వాసుదేవరావు

ఇచ్చారు. ముక్త్యాల వారికి వేదాద్రి నరసింహుడు ఇలవేలుపు. ఇందలి ఇతివృత్తం బ్రహ్మాండ పురాణంలో బీజప్రాయంగా వుండి చంద్రమౌళీప్రసాద్‌గారి పితామహులైన భవానీ మూర్తీశ్వర ప్రసాద్‌గారు దీన్ని ఆధారంగా చేసుకుని ఒక చిన్న కృతి రాయించారుట శాస్త్రిగారు దాన్ని పెంచి ఐదు ఆశ్వాసాల కావ్యంగా మలిచారు. చేమకూర వెంకటకవి విరచిత విజయ విలాసమును కూచిమంచి జగ్గకవి సుభద్రా పరిణయంతో పోల్చి - చేసిన విమర్శనా గ్రంథాన్ని కూడ కృష్ణమూర్తి శాస్త్రిగారు చంద్రమౌళీ ప్రసాద్ గారికి అంకితమిచ్చారు.

చంద్రమౌళీ ప్రసాదు గారి మహోన్నత వ్యక్తిత్వాన్ని కృష్ణమూర్తి శాస్త్రిగారు కృష్ణభారత పీఠికలో

" అడిగిన దానికన్న నధికార్థము లర్థుల కిచ్చు, నోడిన్
నుడివిన దానికన్న గడునూల్కొని జేయను జెన్నుమీఅనె
య్యెడ దురితంబులంబలుక డిప్పటిరాజ మహేంద్రుడెన్న మా
యెడ తుడు భారత [illegible]

అని వర్ణించారు.

అదే విధంగా చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు,

**చనుటకు శక్తి చాలమి వెసవిగర పత్రము లంపినంతనే ధనమిడు, తేడులున్ గలరుదారులు కొందరు నాకు; వారిలో ఘనుడం వాసిరెడ్డి కులకాంతుడు శ్రీ శశి మౌళి యొక్కడై నిను నటు వ్రాసి పుచ్చుటకు నా మదిసిగ్గిలు**

అని ప్రశంసించారు.

## శ్రీమద్రామాయణ కల్పవృక్ష శ్రుతిశ్రోత

కారణమేమో తెలియదుకాని రామాయణం తెలుగువారికి అతి ప్రీతిదాయకమైన గ్రంథమయినా, వ్యాసమహా భారతానికి కవిత్రయ ఆంధ్రమహా భారతము వ్యాస మహా భాగవతానికి బమ్మెరపోతన ఆంధ్రమహా భాగవతం వచ్చిన స్థాయిలో వాల్మీకి రామాయణానికి అనువాదం రాలేదు. రంగనాథ రామాయణం, మొల్ల రామాయణం వచ్చినా అవి ఆ స్థాయికి జేరుకోలేదు. అట్టి గౌరవం ఈ శతాబ్దంలో మొదటి 'ఆంధ్రవాల్మీకి' వావిలాల సుబ్బారావుగారికి తర్వాత కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారికి దక్కింది. శ్రీమద్రామాయణ కల్ప వృక్షం ఏ ప్రాచీనాంధ్ర కావ్యానికి తీసిపోని మహాగ్రంథం. దీని కృతిశ్రోత చంద్రమౌళీ ప్రసాద్‌గారు "ముక్తినీల యవని పాలుడు చంద్రమౌళి నృపతి వినిన లీలగాను" ఈ గ్రంథం రచింపబడినది. సత్య కవి వక్త ముక్త్యాల స్వామిశ్రోత అని విశ్వనాద వారు పేర్కొన్నారు. ఈ మహాకావ్యాన్ని ముద్రింపజేసినది చంద్రమౌళీ ప్రసాద్ ఈ విధంగా మహాభారత రామాయణ రచనలను ప్రోత్సహించినది చంద్రమౌళీప్రసాద్.

## ప్రాచీన గ్రంథ ప్రచురణ

చంద్రమౌళీ ప్రసాద్ ప్రాచీన గ్రంథ ప్రచురణను ఒక ఉద్యమంగా చేపట్టారు. ఇందుకు మాహిష్మతి ముద్రణాలయం అనే ప్రింటింగ్ ప్రెస్సును నెలకొల్పారు. కపికనేని రామాయణ విరచించిన బ్రహ్మానంద చంద్రిక అనే తత్త్వ గ్రంథాన్ని మారన పండితుడు రచించిన కూడ ముద్గరమనీ ఆయుర్వేద గ్రంథాన్ని మిట్టపల్లి సీతారామచంద్రసూరి విరచిత కాల నిర్ణయమనే జ్యోతిష గ్రంథము పూర్వం తమ సంస్థానాన్ని ఆశ్రయించుకున్న మహాకవులు రచించిన ద్రౌపదీ పరిణయము, కృష్ణ మహాత్మ్యము, కాంచీపుర మహాత్మ్యము యింకా ఎన్నో కావ్యాలను ముద్రించి వెలుగులోనికి తీసుకువచ్చారు. తమ స్వంత ముద్రాణాలయంలో ఉద్భటారాధ్య చరిత్ర నాటకీయో వాఖ్యానం వంటి గ్రంథాలను పండితుల చేత పరిష్కరింప జేసి ముద్రింపజేశారు.

చంద్రమౌళీ ప్రసాద్ గారికి ఆయుర్వేద వైద్యం అంటే అభిమానం ఎక్కువ. వీరు ముక్త్యాలలో వేటూరి చంద్రశేఖరశాస్త్రి గారి ఆధ్వర్యంలో ఆయుర్వేద ఆసుపత్రిని స్థాపించి - దాన్ని రీసెర్చి సెంటర్‌గా అభివృద్ధి పరిచారు. సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యుడు ఆచంట లక్ష్మీపతిగారి 'ఆయుర్వేద దర్శనం' అనే గ్రంథాన్ని ప్రచురించారు.

సంగీత రత్న బిరుదాంకితులు పిరాట్ల శంకర శాస్త్రిగారు వీరి ఆస్థాన సంగీత విద్వాంసులు ఆంధ్ర రవివర్మగా ప్రసిద్ధి పొందిన ఆత్మూరి రామమోహనరావు గారిని ముక్త్యాల సంస్థానాధీశులు పోషించారు. వీరి చేత భారతగాధ యందలి ముఖ్య ఘట్టాలను చిత్రాలుగా గీయించి శ్రీకృష్ణశాస్త్రి గారి కృష్ణ భారతములో చేరి ఆ కావ్యాన్ని సచిత్రంగా చంద్రమౌళీ ప్రసాద్ ముద్రించారు.

# అద్భుత సృష్టి వైచిత్రి

త్రయీ బృందావనంలో ఇటీవలనే, వేసవి తరగతులు ప్రారంభము కావడానికి ముందు రోజున, ఇంగ్లాండు, అమెరికా, ఇటలీ మొదలగు దేశములనుండి వచ్చిన కొందరు విదేశీయుల కుటుంబాలతో కలిపి స్వామి మాకు ఇంటర్వ్యూ ఇచ్చారు.

ఇంటర్వ్యూ ప్రారంభములోనే స్వామి పెద్ద మొత్తంలో విభూతిని సృష్టించి తన ఎడమవైపున కూర్చున్న స్త్రీలకు ఇచ్చారు. నేను తీవ్రమైన గొంతునొప్పితో బాధపడుతున్నానని చెప్పి వాళ్ళతోబాటు నాకు, మా మూడవ కుమారుడు మనోహర్‌కు కూడా ఈ విభూతిలో ఎక్కువ భాగము ఇచ్చారు. కొంచెంసేపు అక్కడున్న వారందరినీ కుశల ప్రశ్నలు వేసి, ఆ తరువాత ఒక దంపతుల వివాహ రజతోత్సవము జరిపారు. వారియందు అనుగ్రహ పూర్వకముగా నల్లపూసలతో, రెండు శతమానములతో, పొడవైన ఒక బంగారు నెక్లెసును సృష్టించారు. ఈ దంపతులలో భర్త, తన భార్యమెడలో ఆ మంగళ సూత్రమును ముడివేస్తూండగా స్వామి స్వయంగా తానే వివాహ మంత్రములు పఠించారు. అలా పెళ్ళి మంత్రాలు చదువుతూ నావైపు చూచి "నేను పెళ్ళి మంత్రాలు సరిగా చదువుతున్నానా?" అని అడిగారు.

తరువాత స్వామి అక్కడ కూర్చున్న ఒక కుర్రవాని నుండి గతంలో నేను సృష్టించిన ఒక వెండి ఉంగరమును తీసికొని, దానిపై మూడుసార్లు నోటితో ఊదగానే అది అత్యంత ఆశ్చర్యకరముగా స్వామి రూపము చెక్కబడిన బంగారు ఉంగరముగా మారిపోయింది!

ఆ తరువాత స్వామి ధగధగ మెరిసిపోతున్న ఒక పెద్దసైజు బంగారు కంకణమును సృష్టించి ఈ బృందములోనున్న ఒక వ్యక్తి ముంజేతికి తానే స్వయంగా తొడిగారు. దానితో ఆయన ముఖం ఆనందముతో వెలిగిపోయింది.

యవ్వన ప్రాయములో అడుగు పెడుతూన్న ఒక "కను స్వామి 'నీకు పెళ్ళయిందా' అని అడిగారు. దానికి ఆమె తనకింకా పెళ్ళికాలేదని సమాధానం చెప్పింది. కాని, ఆమె సమాధానం ఇంకా పూర్తి కాకుండానే స్వామి ఆమె కొరకు ముత్యములు, కెంపులు, పచ్చలతో పొదగబడిన ఒక పెద్ద పతకము చివర వ్రేలాడుతున్న చాలా అందమైన ఒక ముత్యాల హారమును సృష్టించి ఆమెకు ఇచ్చారు. అనుకోకుండా లభించిన ఈ అదృష్టమునకు ఆమె ఆనందముతో నోట మాట రాకుండా ఉండిపోయింది!

## ఘండికోట వెంకట సుబ్బారావు

కొన్ని నిముషాల తరువాత, తన భర్త ప్రక్కనే కూర్చున్న ఒక వివాహిత స్త్రీ కొరకు స్వామి మళ్ళీ ధగధగా మెరసిపోతున్న వజ్రములు, రత్నములు చుట్టూ పొదగబడియున్న ఒక పెద్దసైజు కంకణమును చాలా యాధాలాపంగా సృష్టించి యిచ్చారు.

ఆ తరువాత మరొక స్త్రీ కొరకు స్వామి యొక్క రూపము చెక్కబడిన బంగారు పతకము చివరన వ్రేలాడుతున్న ఒక బంగారు గొలుసును ఆయన సృష్టించి యిచ్చారు.

పైన చెప్పిన వస్తువులనన్నిటినీ స్వామి భక్తులతో సంభాషిస్తూ, మధ్య మధ్య ఆప్యాయంగా ఛలోక్తులాడుతూ సృష్టించారు.

ఇంతేకాదు, ఆంతరంగిక సంభాషణ జరిపే లోపలి గదిలో కూడా స్వామి ఒక యువకునితో మాట్లాడుతూ వజ్రములు పొదగబడి, బంగారు గొలుసు గల రిష్టువాచీని సృష్టించి అతనికిచ్చి " ఈ వాచీ కరెక్టుగా టైమ్ చూపిస్తుంది, కావలిస్తే చెక్ చేసుకోండి" అని చెప్పారు!

ఈ విధంగా మధ్య మధ్య అద్భుతమైన అనేక వస్తువులను సృష్టిస్తూ ఇంటర్వ్యూ కొంతసేపు కొనసాగిన తరువాత, ఇటలీ దేశమునుండి వచ్చిన కొందరు భక్తులు కూడా మాతో వచ్చిచేరారు. వారుకూడా ఆ ఇంటర్వ్యూలో స్వామి మళ్ళీ సృష్టించిన కొన్ని వస్తువులను చూచి చాలా ఆశ్చర్యమును, ఆనందమును అనుభవించారు.

ఇక ఇంటర్వ్యూ ముగియవచ్చిందనడానికి సూచనగా స్వామి మమ్మల్నందరినీ ఒక్కొక్కరినీ లోపల గదిలోనికి తీసికొని వెళ్ళి మాలో ప్రతి ఒక్కరి సమస్యలను, మేము ఎదుర్కొంటున్న పరిస్థితులను మాతో వ్యక్తిగతంగా చర్చించారు. అదే విధంగా, స్వామి దగ్గరకు చేరుకోవడానికి పూర్వమే చాలాకాలము క్రితం మాకుటుంబములో జరిగిన అనేక విషయాలను కూడా ముచ్చటించి మమ్మల్ని ఆశ్చర్య చకితులను ు. మా కుటుంబ సభ్యులకు సంబంధించిన ప్రాపంచిక, ఆధ్యాత్మిక పరమైన అనేక సమస్యలపై అమూల్యమైన సలహాలు, సూచనలు ఇచ్చి, వాటిని ఏ విధముగా పరిష్కరించుకోవాలో చెప్పారు.

స్వామి మాకు ఇచ్చిన ఈ ఇంటర్వ్యూ అనేక విధములుగా చాలా విశిష్టమైనది, విలువైనది. ▣

## సత్యసాయీశ ! జగదీశ !

"గంగానదీ స్నాన గౌరవంబది దక్కు
నీబూది పూతను నియతిఁ దాల్ప
నొక కాలిపైఁ జేయు నుగ్రమౌ తపమగు
నీ పాద సన్నిధి నియతిఁ నిల్వ
రాజసూయాది సత్క్రతు ఫలంబది దక్కు
నీ కీర్తనంబులు నియతి చాడ
సర్వ పుణ్యక్షేత్ర సంచార ఫలమిచ్చు
నీ పూజనంబున నియతి మనఁగ
తేనె పెరయింటిలో నుంట తెలియలేక
అడవులంబట్టి యిడుములు గుడవనేల?
దొడ్డిలోనున్న వేలుపుంగుడ్డి వీవు
సత్యసాయీశ ! జగదీశ ! స్వప్రకాశ ! ॥

**- తాళ్లూరి సత్యనారాయణ**

## పదాల పందిరి - 14

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | * | 2 | * | 3 | 4 |
| | * | 5 | | 6 | * | |
| 7 | | | * | 8 | | |
| * | * | | * | | * | * |
| 9 | | | * | 10 | | 11 |
| | * | 12 | 13 | | * | |
| 14 | | * | | * | 15 | |

### ఆధారాలు

**అడ్డం**

1. సముద్ర తరంగం
3. దగ్గర
5. హలము
7. విహరించువాడు
8. చెల్లెలి భర్త
9. సరళరేఖలోని గీత లేకపోతే ?
10. తిరగబడ్డ చిటుక్కు
12. రంగవల్లికలు
14. వర్ణం
12. కత్తిని ఇందులో పెడతారు

**నిలువు**

1. 'అడవి' వికృతి ?
2. ధూము
4. ఫౌండేషన్
5. కొబ్బరికాయ
6. 'లిమరిక్కులు' అదే విధంగా
9. డూప్లికేట్ జడ
11. కొన
13. తలక్రిందులైన రగ్గు

## పదాల పందిరి - 13 సమాధానాలు

**అడ్డం :**

1. గాదె 3. నావ 5. ధమని 7. భంజనం 8. శారద 9. జటాయు 10. రుధిరం 12. దుములు 14. నంది 16. జాన్

**నిలువు :**

1. గార్దభం 2. దోమ 4. వరద 5. ధనంజయుడు 6. నిశాచరులు 9. జలనం 11. రంగూన్ 13. ముఖం

# శీల సంపద

సృష్టిలో వెలుగు, చీకట్లు - రేబవళ్ళు ఉన్నట్టుగానే, మంచి చెడులు కూడ ఉంటాయి. ప్రతి మనిషిలోను, మానవత్వము - దానవత్వము అనే ద్వంద గుణాలు ఉంటాయి. ఈ రెండూ సమపాళ్ళలో ఉండవు. మానవత్వ మధికముగా ఉన్నవాడే మహామనిషిగా కొనియాడ బడతాడు. తద్విరుద్ధంగా దానవత్వమే అధిగమిస్తే అతడు దుర్మార్గునిగ పరిగణించబడతాడు! అట్టి దానవతా లక్షణాలను విసర్జించి, మానవతా సుగుణాలను, మానవుడు అలవర్చుకొనాలి! మనిషి నడవడిని, ప్రవర్తనను సక్రమమైన సన్మార్గం వైపు మళ్ళించగలిగే తరుణోపాయాలు చూపించేవే సద్గ్రంధాలు. సత్ప్రవర్తన అన్నది, అతి చిన్న విషయాల్లో గూడ గోచరించవచ్చును. కష్టాలతో, బాధలతో క్రుంగి పోతున్నవానికి మనమేవిధమైన సహాయము చేయలేక పోవచ్చును. కాని సానుభూతి పరమైన ఒకటి రెండు చల్లని మాటలు చెప్పినచో ఆ దుఃఖమునకు కొంత ఉపశమనము కలుగుతుంది.

అట్లే - ఎంత చిన్న సహాయము ఎవరు చేసిననూ, దానికి తగురీతిని కృతజ్ఞత చూపించడం కనీస మానవ ధర్మం. అంతేకాదు దైవదత్తమైన సంపదలకు, జ్ఞానములకు గర్వోన్నతులు కాకుండుట కూడ సద్గుణమే! ఇటువంటి సద్గుణములన్నియూ కలిగియున్న మానవుడుంటాడని మనకు సందేహము కలుగుట సహజమే!

అసలు రామాయణ మహాకావ్యం ఈ ప్రశ్నలోనే ప్రారంభమయింది. "సకల సద్గుణ సంపన్నుడూ, పరమ పరాక్రమవంతుడు, ధర్మజ్ఞుడు, సత్యవ్రతుడు, అచల సంకల్పుడు, సదాచార వర్తకుడు, సర్వశాస్త్రజ్ఞుడు, ధైర్యవంతుడు, కాంతిమంతుడు, కోపములేనివాడు, కోపమురానివాడు, అసూయారహితుడు, కృతజ్ఞతా స్వభావుడు అయినటువంటి మహానుభావుడెవరైనా ఈ లోకములో ఉన్నాడా? - ఉంటే ఆయన గురించి తెలియచెప్పండి స్వామీ!" - అంటూ వాల్మీకి మహర్షి - తపోధనుడు, మహర్షి శ్రేష్ఠుడు అయిన నారదమునీంద్రు లను వేడుకొంటాడు! "ఇట్టి సకల లక్షణములు కలిసి యున్నవాడు ఈ భూలోకములో ఉండడము దుర్లభమే! ...కాని... ఇక్ష్వాకు వంశములో పుట్టి, రామునిగ ప్రసిద్ధికెక్కిన మహానుభావుడొక్కడు మాత్రమే అందుకు మినహాయింపు!' అంటూ చెప్తారు. నారదమునీంద్రులు!

లోకంలో మానవుల కుండవలసిన మంచి లక్షణములనన్నింటి మానవ రూపములో అవతరించిన రాముని ప్రవర్తనలో మనకు గోచరిస్తాయి. ఆ లక్షణము లను గ్రహించి, సన్మార్గానజీవించి, తమ జన్మలను చరితార్థము చేసికొనుటయే మానవుల కర్తవ్యము. శ్రీరాముడాచరించిన ధర్మమార్గమును అవకాశమున్నంత మేరకు ప్రతివ్యక్తి ఆచరించుట కష్ట సాధ్యము కాదు! అందుకే మానవ రూపమెత్తిన భగవానుడ్లే, ధర్మస్వరూపుడైన రాముడని వాల్మీకి ప్రస్తుతించారు. రామాయణ కావ్య

## సోమంచి రామం

పరమార్థమిదే! కేవలము లక్షణములను బోధించినంత మాత్రాన, మానవులకు గురికుదరదు. సూత్రములను వల్లించినంత మాత్రాన సరిపోదు. వానిని అర్థము చేసికొని అవసరమైనపుడు అన్వయించగలగడమే ముఖ్యం! అందుకే రాముని చరితమును, పరికించి, పఠించి, పరిశీలించడం అవసరం!

అన్నటికన్న మానవునికి అతి ప్రధానమైనది శీలసంపద! శీలము అన్నది - యిలా ఉంటుంది అని చెప్పడంకాని, కళ్ళకు కనిపించేలా చూపించడం కాని సాధ్యం కాని విషయం! ఒక్కమాటలో చెప్పాలంటే సత్ప్రవర్తనమే శీలము. ఆ సత్ప్రవర్తన అన్నది ఎలా ఉండాలో - ఎలా ఉంటుందో రాముని జీవిత కధ మనకు తెలియజేస్తుంది. సత్ప్రవర్తనా నియమావళిని, పసితనంలోనే ఉగ్గుపాలతో రంగరించి శివాజీకి బోధించిన మాతృమూర్తి జిజియా బాయి! అందువలనే శివాజీవంటి మహావీరుడు మచ్చలేని శీలవంతుడైనాడు.

కనుక, బాల్యమునుండే పిల్లలకు ఈ సత్ప్రవర్తనా నియమావళిని ఆచరణలో చూపుతూ, ఆచరించేలా చేయడం, తల్లితండ్రుల ప్రధమ కర్తవ్యం! శీల సంపద కల్గిన వ్యక్తిని నిలువరించే శక్తిగాని, ఎదురించే బలంగాని ఈ లోకంలో ఎవ్వరికీ ఉండదు!

# అబీద్ హుస్సేన్

అబీద్ హుస్సేన్ స్వామి భక్తుడు కాదు. అసలు ఆయనకు దేవుడంటేనే నమ్మకంలేదు. పరమనాస్తికుడు. ఐ.ఎ.యస్. పరీక్షలో ఉత్తీర్ణుడై భారత ప్రభుత్వంలో అనేక ఉన్నత పదవులు నిర్వహించాడు.

అబీద్ హుస్సేన్ భారత ప్రభుత్వ వాణిజ్య మంత్రిత్వశాఖ సెక్రటరీగా ఉన్నప్పుడు హైదరాబాదుకు ఏదో పనిమీద వచ్చి ఒక స్నేహితుణ్ణి కలవటానికి వాళ్ళింటికి వెళ్ళాడు. ఆ ఇల్లు తోరణాలతో అలంకరించబడి ముగ్గులు తీర్చబడి అక్కడ ఏదో శుభకార్యం జరగబోతున్నట్లుగా ఉంది. అబీద్ హుస్సేన్ తన స్నేహితుణ్ణి ఆ విషయమే అడిగాడు 'మీ ఇంట్లో శుభకార్యమేదైనా జరుగుతుందా?' అని. దానికి ఆయన స్నేహితుడు "అవును నిన్న జరిగింది. భగవాన్ శ్రీసత్యసాయిబాబా నిన్న మాఇంటికి వచ్చి నా మనవడికి నామకరణం చేశారు." అని చెప్పాడు.

అప్పుడు అబీద్ హుస్సేన్ "సాయిబాబా గురించి అనేక విషయాలు విన్నాను. వారిని కలవటానికి అవకాశం ఉంటుందా?" అని అడిగాడు. "నిన్నయితే ఇక్కడే కలిసే అవకాశం ఉండేది. ఈ రోజున వారు ఇంకొకరి ఇంట్లో ఉన్నారు. అయినా ప్రయత్నిస్తాను." అని చెప్పి ఫోనుచేసి ఎవరితోనో మాట్లాడి "సాయిబాబా గారు నిన్ను ఈ సాయంత్రం నాలుగు గంటలకు కలుస్తానన్నారు." అని చెప్పాడు.

కాని అబీద్ హుస్సేన్‌కు ఆ రోజు సాయంత్రం నాలుగు గంటలకు వేరే పని ఉంది. ఒక గంట ముందుగానైతే బావుండేది అనుకుంటుండగా ఫోన్ మోగింది. ఆ ఇంటి యజమాని ఫోన్‌లో మాట్లాడి, అబీద్ హుస్సేన్ దగ్గరకు వచ్చి "నాలుగు గంటలకు కాదు మూడు గంటలకే నిన్ను కలుస్తానన్నారు సాయిబాబా" అని చెప్పాడు. తన మనసులో అనుకున్నది వెంటనే జరిగినందుకు ఆశ్చర్యపడిన అబీద్ హుస్సేన్‌కు స్వామిని కలవాలనే ఉత్సుకత పెరిగిపోయింది. అయినా తనొక్కడే సత్యసాయిబాబాని కలవటం ఇష్టంలేక ఇంకొక స్నేహితుణ్ణి కూడా వెంట తీసుకొని వెళ్ళాడు.

బాబా ఉన్న ఆ ఇంటి ఆవరణలో అనేక వందలమంది స్వామి దర్శనం కోసం వేచిఉన్నారు. అందులో సామాన్యులే కాక, మంత్రులు, జడ్జీలు, ఉన్నతాధికారులు అనేక మంది ఉన్నారు. అబీద్ హుస్సేన్, ఆయన స్నేహితుడు అక్కడకు చేరిన కొద్ది నిమిషాలలోనే ఒక గదిలోకి రమ్మని కబురొచ్చింది. ఆ గదిలో స్వామి కూర్చునే సింహాసనం వంటి ఒక కుర్చీ, ఒక తివాచీ తప్ప మరే వస్తూవూ లేదు. బాబా ఆ గదిలోకి వచ్చి ఉర్దూ భాషలో వారికి నమస్కారం అని చెప్పారు. మళ్ళీ ఉర్దూలోనే "కూర్చోండి" అని చెప్పటంతో అంతా తివాచీ మీద కూర్చున్నారు.

## డి. వెంకటేశ్వరరావు

స్వామి అబీద్ హుస్సేన్‌తో ఉర్దూలోనే ఇలా చెప్పారు. "నీవు ఒక మనిషివి కావు, ముగ్గురు మనుషులవి, నీవు నీ గురించి అంచనా వేసుకొనేది ఒకటి, ఇతరులు నీ గురించి అనుకుంటున్నది రెండు, నిజమైన నీవు మూడు, మీ వదినగారు నా దర్శనం చేసుకోవాలని చాలా కాలం నుంచి అనుకుంటున్నది. అయినా ఆవిడకు ఆ అదృష్టం లేదు. ఈ జన్మలో ఆవిడకు నా దర్శనం కాదు. ఆవిడ ఈ వస్తువు నా దగ్గరనుండి కావాలనుకుంటున్నది" అని చెప్పి గాలిలోంచి ఒక వస్తువును సృష్టించి అబీద్ హుస్సేన్‌కిచ్చి వదినగారికి ఇవ్వమన్నారు.

బాబా హుస్సేన్‌తో "నీవెందుకొచ్చావు?" అని అడిగారు. అందుకు సమాధానంగా హుస్సేన్ "ప్రత్యేకమైన కారణం లేదు. మీకు అనేక మంది భక్తులున్నారు, మీరెటువంటి వారో చూడాలని వచ్చాను" అన్నాడు.

అప్పుడు స్వామి "నీవేమి కావాలన్నా కోరుకో, నీ కోరిక తీరుస్తాను" అని ఎంతో ప్రేమతో అన్నారు. "నేనేమి కావాలని అడగటానికి మీ దగ్గరకు రాలేదు. మిమ్మల్ని కలిసే అవకాశం వచ్చినందుకు ఎంతో సంతోషంగా ఉంది. గొప్ప అనుభవంగా దీన్ని నేను జ్ఞాపకం ఉంచుకుంటాను" అని వినయంగా చెప్పాడు హుస్సేన్.

అప్పుడు స్వామి "సరే, నీకో విషయం చెప్తాను. అతి త్వరలో నీవు విదేశాలకు వెళ్తావు. ఈ ప్రపంచంలో ఏ శక్తీ నిన్ను వెళ్ళకుండా ఆపలేదు". అని చెప్పారు. స్వామి దగ్గర శెలవు తీసుకున్న తర్వాత అబీద్ హుస్సేన్ చాలా ఆశ్చర్యపోయాడు. ఏ విధంగా చూసినా తను విదేశాలకు వెళ్ళే అవకాశం లేదు. ఆ రోజు రాత్రే ఆయన విమానంలో ఢిల్లీ చేరుకుని, ఆ మరుసటి రోజు ప్రభుత్వ పనిమీద వాణిజ్య శాఖామంత్రిని కలిశాడు.

మంత్రితో చర్చలు జరిపి, కావలసిన కాగితాల మీద సంతకాలు పెట్టించుకుని, వెళ్ళబోతుంటే, మంత్రి అబీద్ హుస్సేన్‌ను మళ్ళా పిలిచి ఇలా అన్నాడు. "ప్రభుత్వం నిన్ను ఫిజీ దేశానికి పంపించాలని ఆలోచనతో ఉంది. కానీ నీకిక్కడ చాలా పనులుండటం వల్ల నిన్ను పంపించటం నాకిష్టం లేదు." అబీద్ హుస్సేన్‌కి అప్పటిదాకా ప్రభుత్వానికి ఆ యోచన ఉందనీ, దానికి సంబంధించిన ఫైలు ఆ మంత్రి దగ్గరే ఉందనీ తెలియదు.. బాబా తనతో చెప్పిన విషయాలు జ్ఞాపకం వచ్చి, అప్రయత్నంగా అబీద్ హుస్సేన్ నోటి వెంట ఈ మాటలొచ్చాయి. "నేను విదే[illegible] వెళ్తున్నాను, నన్ను వెళ్ళకుండా ఆపేశక్తి ఈ ప్రపంచంలో లేదు."

ఎంత ప్రభుత్వ ఉన్నతోద్యోగి అయినా మంత్రితో అలా మాట్లాడడు. మంత్రికి చాలా కోపం వచ్చింది. "ఏమిటా మాటలు?" అని గద్దించి అడిగాడు. అప్పుడు అబీద్ హుస్సేన్ "ఇవి నా మాటలు కావు ఈ మాటలన్నది శ్రీసత్యసాయిబాబా" అని చెప్పాడు. మంత్రి ఆశ్చర్యంగా "శ్రీసత్యసాయిబాబాయా?" అని ఎపుడు, ఎక్కడన్నారు? అని అడిగాడు.

"నేను నిన్న హైదరాబాద్‌లో ఆయనను కలిశాను. అప్పుడు వారు నాతో ఈ మాటలన్నారు" అని చెప్పాడు అబీద్ హుస్సేన్. మంత్రి కొన్ని క్షణాలు అబీద్ హుస్సేన్ ముఖం వంక చూసి, ఏమీ మాట్లాడకుండా పెన్ను తీసి, హుస్సేన్ ఫిజీ దేశానికి వెళ్ళే కాగితాలమీద సంతకం పెట్టాడు. 

## నిర్భయము - నిర్మొగమాటము

అది సికిందరాబాద్ లోని కాలేజిలో ఒక సభ. ఒక విదేశీ లేడీ డాక్టరు ప్రధాన వక్త. ఆమె భారతీయ స్త్రీలను గురించి ప్రశంసా పూర్వకంగా ఉపన్యసించింది. మరొకవక్త మన భారతనారి. తన ఉపన్యాసంలో భారతదేశ స్త్రీలు ఎంతటి దురాచారాలలో అవస్థలు పడుతున్నదీ నిర్భయంగా చాటి చెప్పింది. కన్యా శుల్కాలు, బాల్యవివాహాలు, వరవిక్రయాలు మొదలగు సమస్యలను ప్రస్తావించి విమర్శించింది.

ఈ యువతిని ఒక రచయిత కలసినప్పుడు తను జైలులో వున్నాననే విషయం ఆమె ద్వారా విన్నప్పుడు అతను ఆశ్చర్యపోయాడు. దేశ స్వాతంత్ర్యము గురించిన పోరాటములో తన దృష్టిలో అది నేరముకాదని గర్వకారణమని ఆ విదేశీరచయితకు చెప్పింది.

మనకు స్వతంత్ర్యము వచ్చిన తరువాత మొట్టమొదటి స్త్రీ గవర్నరు ఈమెయే! ఈ రోజులలో పదవులలో వున్నవాళ్ళకి ఎన్నో సదుపాయాలు కావాలి. ఆమె తన సిబ్బందిని తగ్గించివేసింది. ఒక్కొక్కసారి సిబ్బంది తక్కువగా వుండుట వల్ల తన నివాసము తానే తుడుచుకోవలసి వచ్చేది.

స్త్రీల హక్కుల కోసం పోరాడింది. స్వాతంత్ర్యం కోసం పోరాడింది. జాతీయ సమైక్యతకు, సంఘసంస్కరణలకు తన జీవితాన్ని అంకితం చేసుకుంది. గోఖలే, గాంధీలకు శిష్యురాలైంది. నెహ్రూకు ప్రియతమ సోదరిగా మెలిగింది. ఆంగ్లంలో చిన్నతనం నుండి కవితలల్లింది. మహానాయకులకు తలలో నాలుకగా మెలిగింది. మాటలలో చమత్కారిగా పేరు పొందింది. మనసులో విషయాలను నిర్భయంగాను, నిర్మొగమాటంగాను చెప్పేది. ఈమె జాతీయ కాంగ్రెస్‌లో తొలి నాయకురాలుగా పనిచేసింది. నారీ లోకానికే వన్నెతెచ్చిన ఈమె 'శ్రీమతి సరోజినీనాయుడు.' నేటి బాలికలు, యువతులు ఇటువంటివారి చరిత్రను చదివి స్ఫూర్తిని పొందాలి.

- ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

# విశ్వనాథావధూత

శ్రీకాకుళం జిల్లా పాలకొండలో శ్రీ సింహాద్రి వీరయోగీంద్రస్వామి అను ఒక గృహస్థు ఉండేవాడు. ఆయన భార్య గౌరీదేవి. వారికి శ్రీకాశీవిశ్వేశ్వర స్వామి అంశతో క్రీ.శ. 1794 లో ఒక కుమారుడు కల్గాడు. ఆయనే సుప్రసిద్ధ యోగివర్యుడు సనారీ కాశీవిశ్వేశ్వరస్వామి. వారికి తల్లిదండ్రులు పెట్టిన పేరు విశ్వనాథుడు.

విశ్వనాథుడు చిన్నతనం నుండే అనేక మహిమలు చూపుతూ వుండేవాడు. ఒకసారి ఆయన ఒక గొర్రె పిల్ల చనిపోతే బ్రతికించాడు. అప్పుడే గ్రామ వాసులలో కొందరు ఆయనను పరీక్ష చేయదలచగా, ఆయన చనిపోయిన మనిషిని కూడ బ్రతికించారు.

యుక్తవయసురాగానే ఆయన గౌరీ అంశతో జన్మించిన అన్నపూర్ణను పెండ్లాడి గృహస్థాశ్రమం స్వీకరించాడు. ఆ దంపతులు అతిథి సత్కారాన్ని ఎంతో దీక్షగా చేస్తుండేవారు. ఒకసారి కొందరు మహర్షులు వారిని పరీక్ష చేయటం కోసం భోజన సమయానికి వచ్చారు. విశ్వనాథ దంపతులు వారిని ఆదరించి తృప్తిగా భోజనం పెట్టారు. వారు వెళ్లారో, లేదో మరికొందరు ఋషులు వచ్చారు. వారూ భోజనం చేసి వెళ్లగానే యింకా కొందరు, ఇలా భిక్షకు స్వాములు వస్తూనే వున్నారు. విశ్వనాథ దంపతులు తాము భోజనం చేయకుండానే వారిని సంతృప్తి పరుస్తూ వున్నారు. వారియింట అంతమందికి సరిపడే సామాగ్రి ఎలా వచ్చింది? క్షణాల మీద వంటలు ఎలా సిద్ధమవుతూ వచ్చాయి? ఊహకందని సంగతి.

ఒకసారి అన్నపూర్ణగారు సమాధి నిష్ఠలో వున్నారు. విశ్వనాథుడామెను తీసికొనిపోయి గొయ్యి తీసి అందులో ఆమె శరీరాన్ని పూడ్చిపెట్టారు. మర్నాడు ఆయనక్కడకు పోయి, సమాధిని తవ్వి ఆమె శరీరాన్ని తీసికొనివచ్చి, తన ఇంటిలోనే ఖననం చేశారు. గ్రామస్థులిది చూసి ఊరి నడుమ శవాన్ని పూడ్చి పెట్టినందుకు కలక్టర్ గారికి ఫిర్యాదు చేశారు. కలక్టర్ వచ్చి ఇల్లంతా పరీక్షచేసినా ఆయనకు ఎక్కడా తవ్వి పూడ్చిన దాఖలా కనిపించలేదు. అప్పుడు విశ్వనాథుడు ఆయనతో 'అన్నపూర్ణను చూస్తారా?' అనడిగి సర్వాభరణ భూషిత అయిన అమ్మవారి దర్శనం చేయించారు.

విశ్వనాథుని మహిమలు గురించి విన్న విజయ నగరరాజు ఆయనను తన ఆస్థాన శిల్పాచార్యుడుగా నియమించుకొన్నారు. కాని ఆయన రాజుకెన్నడూ నమస్కారం చేయలేదు. కొందరాసంగతి రాజుగారి చెవికి కొండెంగా చేరవేశారు. అప్పుడు విశ్వనాథుడు అంతా చూస్తుండగా ఒక పెద్ద రాతి గుండుకు నమస్కారం చేశాడు. తక్షణమే అది పగిలి ముక్కలు, ముక్కలైంది. దానితో ఆయన రాజుగారికి ఎందుకు నమస్కరించటల్లేదో అర్థమైపోయింది.

స్వామివారు గొప్ప సంస్కర్త. కులభేదాలకు వ్యతిరేకి. జంతు బలులను మాన్పించేవారు.

ఆయన అనేక మహిమలు చేశారు. దరిద్రురాలిని కరుణించి ధన సంపత్తినిచ్చారు. పరుసవేదిని (లోహాలను బంగారంగా మార్చేది) ప్రదర్శించారు. ఒక కుష్టు రోగి వ్యాధిని నయం చేశారు. మూడవ కన్నును ప్రదర్శించారు. భక్తులకు కైలాస దర్శనం చేయించారు.

## భండారు పర్వతాలరావు

శ్రీసనారీ విశ్వేశ్వర స్వామి రచించిన 'సనారీ విశ్వేశ్వర సంవాదము' అనే గ్రంథాన్ని 19వ శతాబ్దం ఆరంభంలో ప్రచురించారు. కాని దీని ప్రతులు ప్రస్తుతం లభించటం లేదు.



# మానవుడు - భగవంతుడు



Man - Ego = God

God irvolved is Man. Man evolved is God.

Ego (అహంకారం). ఏమిటీ ఈ అహంకారం? నేను, నాది అనే తపనే అహంకారం. ఆ తపనలను మనిషి దూరం చేసుకోగలడా?!

నేను అందంగా వున్నాను. అబ్బే! వాడు కురూపి. నేను బాగా చదువుకున్నాను. అబ్బే! వాడు నిరక్షర కుక్షి. నేను మంచి హోదాలో వున్నాను. అబ్బే, వాడు చిన్న, చితకవాడు. నేను ధనవంతుడను. అబ్బే, వాడు బికారి. నేను గొప్ప వంశానికి చెందిన వాడను. అబ్బే, వాడు అనామకుడు. నేను తెల్లజాతి వాడను. అబ్బే, వాడు నల్ల జాతివాడు. - - - - యిలా, యిలా ఎన్నెన్ని నేను, నేను అనే భావాలు. నీవు గొప్ప వాడవు, బాగా చదువుకున్నవాడవు, అందగాడవు వగైరాలన్నీ వ్యావహారిక సత్యాలు కావచ్చు. కాని, అవతలి వాడు పేదవాడు, చదువు లేనివాడు, కురూపి వగైరా అనే ఈసడింపు భావాలు నీ నుంచి మొట్టమొదట తొలగించుకోగలవా?

ఇంక రెండవ మెట్టుగా నీ గొప్పదనాలనే మననం చేసుకోవటం తగ్గించుకోగలవా? మూడవ మెట్టుగా నీలోని లోపాల్ని గమనించి గుర్తునందు పెట్టుకోగలవా? నాల్గవ మెట్టుగా అవతలి వ్యక్తిలోని గొప్ప గుణాల్ని గుర్తించి ఆమోదించ గలవా? ఐదవ మెట్టుగా - - - - - -? ఆరవ మెట్టుగా - - - - - - ? ఇలా ఆధ్యాత్మిక సాధనా మార్గంలోని మెట్టు ఒకటొకటి ఎక్కాలి. అప్పుడు జ్ఞానోదయమై తెలుస్తుంది. 'నేను' అనుకొనే నేను, 'నేను' కాదని.

**వ్యావహారిక భాషలోనే, you are not what you think you are, but you are what others think you are. ఇక ఆధ్యాత్మిక పరిభాషలో చెప్పాలంటే నీవు నీవనుకునే 'నీవు' ఎలాగవుతావు - ఆలోచించు. 'నీవు ఎవరు? నీవు ఎక్కడ నుంచి వచ్చావు? ఎక్కడకు వెళ్తావు? సమాధానం లేదు కదూ! తెలియదు కదూ? తెలియని** 'నేను' గురించి ఎందుకు అంత అహంభావ పూరితమైన స్పృహ?! ఎందుకు ప్రతి దానికి నేను 'అది', నేను 'ఇది' అని వూరికే యిద్దైపోతావు!? ...టి జీవిని ఎందుకు న్యూనతా భావంతో చూస్తావు?

నీ గొప్పదనాల గు... ఆలోచించుకోకపోతే నీకు జీవితంలో హుషారుండద...లుసు. కాని నీ చుట్టూ వున్న యీ విశాల విశ్వం గురించి, ప్రకృతి గురించి ఆలోచిస్తే - ఆ సృష్టిలో నీవొక స్వల్ప అణు సమానమని గుర్తిస్తే, నీ గురించి ఆలోచిస్తే వచ్చే హుషారు కన్నా ప్రకృతి సహజమైన ఆనందం కలుగుతుంది. ప్రయత్నించి చూడు. ప్రయత్నించి చూడు. నీ ప్రయత్నం వృధా కాదు.

**జి.యస్.ఆర్.సి.వి. ప్రసాదరావు, I.A.S.**

ఇక ఏమిటి ఈ 'నాది' అనే భావన? ఏది నీది? నీవు పుట్టినప్పుడు ఏది నీది? నీవు పోయిన తర్వాత ఏది నీది? నీతో ఏదైనా వస్తువు వచ్చిందా? నీతో ఏదైనా సరుకు తీసుకుపోతావా? పోనీ, యీ భూమి మీద నీ బ్రతుకు ఉన్నంత కాలం, నీవు 'నాది' అనుకునేదేదైనా శాంతి, సంతోషాలను కలిగించిందా? లేక కేవలం సుఖ, భోగాలనే యిచ్చిందా?

Money can give food, but not apetite.
Money can give medicines, but not health.
Material things can give comforts, but not happiness.
Wife, Children, etc., can give pleasure, but not peace.

మరి ఎందుకు - ఈ డబ్బు నాది, ఈ ఆస్తి నాది, ఈ ఇల్లు నాది, ఈ పదవి నాది, ఈ వ్యాపారం నాది, ఈ భార్యా, పిల్లలు, బంధువులు వగైరా నా వాళ్ళు అనే తపన. నాది, నాది, నాది అనుకునే ఇవన్నీ సృష్టిలో ప్రకృతి ప్రసాదాలనీ, వాటికి నీవు ధర్మ కర్త మాత్రమేననీ, నీకర్తవ్యం నిర్వర్తించి బ్రతుకు ప్రయాణం పూర్తిచేస్తాననే భావన నీలో వచ్చి ఆచరిస్తే, ఎంత తేడా, ఎంత తేడా!

ఎంత తేడా నీవు అనుభూతిలోకి తెచ్చుకుంటావు. ఎంతటి ఆనందం నీ సొంతం అవుతుంది! ప్రయత్నించి చూడు. ప్రయత్నించి చూడు. నీ ప్రయత్నం పూర్తిగా సఫలం కాకపోయినా, వృథా ప్రయాస మాత్రం కాదు.

నీ చుట్టూ వున్న సమాజంలోని వ్యక్తుల జీవితాలు నీవు గమనించటం లేదా? ఎవరైనా పట్టుమని పదేళ్ళకు మించి పదవీ గర్వంతోటో, అధికార గర్వంతోటో, అంద చందాల గర్వం తోటో, ఐశ్వర్య గర్వంతోటో మిడిసి పడగలిగేరా? వాళ్ళ జీవితం పదేళ్ళే కాదు గదా?! వాళ్ళ జీవితంలో మిగిలిన దశాబ్దాలు ఎలా గడిచినవో నీవు గమనించలేదా? మహా అయితే పదేళ్ళ కోసం ఎందుకు 'నేను' 'నేను' 'నేను' అనే అహంభావం.

పోనీ, ఏదైనా వస్తువుగాని, ఒక వ్యక్తి గాని, ఎవరికైనా జీవితాంతం సుఖ, సంతోషాల నిచ్చిందా? లేక కేవలం కొంత కాలం మాత్రమే సంతోషాన్నిచ్చిందా? నీవు పరికించలేదా?! ధన, కనక, వస్తు, వాహనాలు తాత్కాలిక సంతోషాల్నిచ్చి కోర్కెల విష వలయంలోకి నెట్టి విషాదాన్నే మిగులుస్తాయని మన చుట్టూ వున్న సమాజంలో మనకు ప్రత్యక్ష సాక్ష్యాలు లేవా? భార్యా, బిడ్డలు, బంధువులు వగైరా ఒక్కొక్కరు కొంత కొంత కాలం సుఖ సంతోషాలు కలిగించవచ్చు. మిగిలిన జీవితంలోని అంత కాలము నిన్ను 'Pieces' గా చేసి నంజుకోకపోతే, నీకు 'Peace' యిచ్చినంత సంబరపడిపోవచ్చు. మరి ఎందుకు, ఈ నాది, నాది, నాది అనే అహంభావం?!

'నేను', 'నాది' అనే అహంభావం లేకుండా యిదంతా ప్రకృతి లీల అనే భావంతో, నేను ఈ జన్మలో నాపాత్ర నేను పోషిస్తాను, ఆ పాత్ర పోషణ కూడ శ్రద్ధతో, బాధ్యతాయుతంగా పోషిస్తాను తప్ప వేరేగా కాదు అని సంకల్పించు కోవటం, అలా చేయటం కూడ ఒక సాధనే మరి.

ఒకే మనిషికి ఎన్నో రకాల బాధ్యతలు వుంటాయి. 1) ఒక దేశ పౌరునిగా కొన్ని బాధ్యతలు 2) ఒక ఊరు (లేక) వాడ (లేక) వీధి నివాసిగా కొన్ని 3) ఒక భర్త (లేక) భార్యగా కొన్ని 4) ఒక తండ్రి (లేక) తల్లిగా కొన్ని 5) ఒక ఉద్యోగిగా (లేక) వ్యాపారిగా (లేక) వృత్తిపరంగా కొన్ని 6) ఈ ప్రకృతిలో ఒక మానవునిగా కొన్ని బాధ్యతలు ఉంటాయి. వీటన్నింటినీ సక్రమంగా నిర్వర్తిస్తున్నావో లేదో ఎప్పుడైనా నీకు నీవు పరిశీలించు కుంటున్నావా?

కొద్ది మంది ఏ బాధ్యతా నిర్వహించకుండా గాలికి తిరుగుతారు. బహు కొద్ది మంది అన్ని రకాల బాధ్యతలు సక్రమంగా నిర్వర్తిస్తూ వుంటారు. మరి చాలా మంది మాత్రం కొన్ని బాధ్యతలు కొంత వరకూ నెరవేరుస్తుంటారు. ఈ చాలా మందిలో మంచి వాళ్ళనిపించుకొనే కొద్ది మంది కూడ తమ ఉద్యోగ ధర్మమో, వ్యాపార ధర్మమో, వృత్తి ధర్మమో సక్రమంగా నిర్వర్తించి మంచి వాళ్ళనిపించుకుంటున్నారు తప్ప, పైన తెలిపిన అన్ని రకాల బాధ్యతలలోని యితర బాధ్యతలు తమవికానట్టు తమ కుటుంబ సభ్యులవో, బంధు - మిత్రులవో, తోటి వాళ్ళవో అయినట్లు భావిస్తారు. ఇంకా కొంత మంది తమకు ఏ బాధ్యతలు లేనట్లు ఆశ్రమాలకో, అడవులకో వెళ్ళిపోయి, మంచివాళ్ళ కోవలోకి చేరి పోయామనుకుంటారు. ఈ మంచి వాళ్ళ కోవలోకి చేరామనుకుంటున్న కొంత మంది, మంచి వాళ్ళనిపించు కుంటున్న ఇంకొంత మంది కూడ ఆధ్యాత్మిక సాధనా మార్గంలో ఎక్కవలసిన మెట్లు ఇంకా చాలా వున్నాయి.

ఆధ్యాత్మిక సాధనా మార్గంలో అన్ని రకాల బాధ్యతలు సక్రమంగా నిర్వర్తిస్తూ సరియైన ప్రయత్నం చేసి, సరియైన ప్రయాణం చేసి తరిద్దాం. ★

# సాయిమతం

*మత మంటే గతి తప్పని మతిరా*
*మత మంటే శ్రుతి తప్పని లయరా*
*ఇదే ఇదే సాయిమతం*
*ఇదే ఇదే విశ్వమతం* ॥ మత ॥

*పరోపకారమే ఓంకార నాదంరా*
*సంకీర్తనములే శ్రీ చక్రార్చనలురా*
*సమాజసేవయే మృత్యుంజయ మంత్రంరా* ॥ మత ॥

*మానవ సేవయే ఓం నమశ్శివాయరా*
*దీనజన సేవయే నారాయణ మంత్రంరా* ॥ మత ॥

**- మంత్రిప్రగడ సత్యం**